శ్రీ వేణుగోపాల దేవాలయ స్థాపకులు

మహర్షి శ్రీ వేంకటదాసస్వామి విరచిత శతకరాజ ద్వయము

# శ్రీ భద్రగిరి రామభద్ర శతకము







"సాహితీవాచస్పతి" మొవ్వ వృషాద్రిపతి

శ్రీ వేణుగోపాలదేవాలయ స్థాపకులు
మహర్షి శ్రీ వేంకటదాసస్వామి విరచిత
శతకరాజద్వయము

# శ్రీ భద్రగిరిరామభద్రశతకము




తాత్పర్యము
'సాహితీవాచస్పతి'
**మొవ్వ వృషాద్రిపతి**

సహాయకుడు
**మొవ్వ కృష్ణప్రసాదు**

**SRI BHADRAGIRI RAMABHADRA SATHAKAM**
**SRI PUDIWADA VENUGOPALA SATHAKAM**
**SRI SESHANAGESA STHAVAM**



వెల : రూ. 250-00

ప్రతులకు :
**మొవ్వ పద్మాలయాదేవి**
W/o. మొవ్వ వృషాద్రిపతి
ఉప్పూడి రోడ్డు, రేపల్లె - 522 265,
గుంటూరు జిల్లా.
ఫోన్ : (08648) 224199, సెల్ :9849865029

డి.టి.పి. :
కె.యస్.పి. రాజు, కొల్లూరు.

ప్రింటింగ్ :
లక్ష్మి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, రేపల్లె.

# ఆముఖము

- సాహితీవాచస్పతి మొవ్వ వృషాద్రిపతి

శ్రీ రాధాంబహృదీశ! శ్రీశపదయుగ్రాజీవలగ్నాంతరం
గా! రామానుజసంయమీశ్వర విశిష్టాద్వైత సిద్ధాంత భా
వారూఢస్థిరచిత్త నిత్యబుత! తద్వ్యాఖ్యానమంజూషికా
సారప్రోన్మద! శిష్యవత్సల! మనస్సాంగత్యలక్ష్మీశ్వరా!

స్థిరమొవ్వాన్వయవార్ధిచంద్రమ! మహాశ్రీభాష్యసిద్ధాంత ని
ర్భరమాధ్వీరసపానమత్త హృదయా! పాండిత్యదుగ్ధాబ్ధి! వి
స్తరసద్భక్తి మహత్త్వబోధదశదిక్సంవ్యాప్తకీర్తిచ్ఛటా!
పరమామ్నాయ విశేషశేముషిధరా! ప్రజ్ఞాపరీరంభణా!

జ్ఞానసూర్యోదయాదిక గ్రంథశతము
నోజ శ్రీభాష్యకారసమాజములను
సృష్టిసలిపి శిష్యులనుద్ధరించినట్టి
ఘనమహర్షి! వేంకటదాస! జ్ఞానవాస!

లాలితభక్తిభావ బహళంబగు నార్తివహించి వేణుగో
పాలుని దేవళం బొకటి వైభవశోభల నేర్పరించి యా
యాలయశాస్త్రలక్షణము లన్యములౌగుడిగోపురాల సం
ఘాలకు మార్గదర్శకముగా వెలుగొందుచుఁ గీర్తినందఁగన్

మహాత్ముల చరిత్రలు ప్రాకృతములైనా అవి అప్రాకృతతుల్యాలు. వారు భగవత్స్వరూపులు. వారి దర్శనమే సర్వపాపహరణం. వారి సన్నిధికైవల్యం. అట్టి మహనీయులెప్పుడో ఎక్కడోయుగానికొక్కరుదయిస్తుంటారు.

మహర్షి వేంకటదాసస్వామివారు, పూడివాడ అనే కుగ్రామంలో శ్రీమతి కృష్ణవేణమ్మ కృష్ణయ్య దంపతులకు కుమారుడై జన్మించినారు. అది శుద్ధిపిండం. ఇరువది యొక్క దినములు తల్లి చనుబాలు త్రావలేదట. ఇది శుద్ధిపిండమని

శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. అయన పురిటిమంచంలో ఉండగా భయంకరమైన సర్పరాజు ఆయన నాలుకపై బీజాక్షరాలు వేసింది. ఆ సర్పాన్ని పట్టుకోవటానికి వారి మేనమామ పాములవారినికూడ రప్పించినాడట.

స్వామిబాల్యం చాల కష్టభూయిష్ఠంగా సాగింది. కృష్ణయ్యగారు నిత్యకృషీవలురు. శ్రమజీవి. కుమారుని ఏడవ సంవత్సరంనుండి పనులలో నియమించినారు. ఆ వయస్సులో నిర్వహించలేని పనులనుకూడ చేయింపచేసేవాడు. స్వామివారికి పసితనంనుండి రామభక్తి అణువణువున నిండి క్రమంగా పెరుగుతూ వచ్చింది. పగలు ఆయనకు తపోజపాదుల కవకాశం ఉండేదికాదు. రాత్రులందు కొద్దిమంది మిత్రులతో భజనలు నిర్వహించేవారు. అందువల్ల స్వామివారికి పాఠశాలలో చదువుకొనే అవకాశం కలుగలేదు. అయినా సంస్కారం జన్మతః సంక్రమించిన ఆయనకు వేరుగా చదువులెందుకు?

తండ్రిగారు పరమపదించిన తదుపరి స్వామివారికి, పూర్తి స్వాతంత్ర్యం కలిగినా బడికివెళ్ళే వయస్సుకాదుగనుక వెళ్ళలేదు. శ్రీమాన్ సీతారామాచార్యులవారివద్ద పంచసంస్కారసిద్ధి పొందారు. శ్రీమాన్ సముద్రాల లక్ష్మణాచార్యులవారివద్దనుండి విశిష్టాద్వైతసిద్ధాంతాలనామూలాగ్రంగా ఆకళించుకొన్నారు. సంస్కృతాంధ్రాలను స్వయంగా అభ్యసించటానికి ప్రారంభించారు. "ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యా" అన్నట్లు చదువుతున్న విద్యలు చదువుతుండగనే మనఃఫలకంపై నిలిచిపోయాయి. సర్వపురాణోపనిషత్తులనామూల చూడంగా పఠించారు. రాధమాంబ ధర్మపత్నిగా గృహస్థాన్ని 'పద్మపత్రమివాంభసా' అన్నట్లు నిర్వహిస్తూ రామాలయాన్ని నిర్మించాలని తలపోశారు. కాని, కాలువనొకటి త్రవ్వుతుండగా వేణుగోపాలస్వామివారి విగ్రహం లభించింది. వారికి రాముడైనా కృష్ణుడైనా ఒక్కటే. వెంటనే ఆలయనిర్మాణానికి పూనుకొని, ఎన్ని కష్టనష్టములువచ్చి పైనిబడినా చలించక, కార్యాన్ని ముందుకు సాగించారు. సొంత పొలాన్ని అమ్మి ఆలయప్రతిష్ఠకూడ పూర్తిచేశారు. వారి తపోనిష్ఠనుగురించి చెప్పాలంటే వేరుగా వేయిపుటలగ్రంథం వ్రాయవలె. ఆయన శాపానుగ్రహసమర్థుడైనాడు.

శ్రీ స్వామివారికి గోపాలకృష్ణమూర్తి అనే ఒక బ్రాహ్మణమిత్రుడు సమవయస్కుండేవాడు. ఒకనాడుస్వామి చేను గట్టున కూర్చుండి గీతాపారాయణం చేస్తుండగా వచ్చి "మీరు అనుష్ఠిస్తున్న యీ పారాయణగ్రంథమేది?" అని ప్రశ్నింపగా భగవద్గీతయని స్వామి ప్రత్యుత్తరం ఇచ్చారు. వెంటనే మూర్తి 'ఆ ముండలముతాకోరు గ్రంథమేదొరికిందా? నీకు పారాయణానికి' అని నిందించినాడు. స్వామి ఆతనికి గ్రంథమాహాత్మ్యాన్ని వివరించటానికి పూనుకొన్నారు గాని, ఆతడు తనవితండవాదాన్ని విడువలేదు. స్వామికాగ్రహం కలిగింది. "ఇదిగో గోపాలకృష్ణమూర్తీ! నీవు ఏడురోజుల తర్వాత జీవించి ఉంటే శ్రీకృష్ణుడు ముండలముతాకోరే. ఆనాడే నేను భగవద్గీతా పారాయణం మానివేస్తాను' అని పలికి కోపంతో లేచిపోయారు. సరిగా ఏడవనాడు స్వల్పరుజ నిమిత్తంగా మూర్తి మరణించాడు. మహర్షి వేంకటదాసస్వామివారు శాపం పెట్టారని ఊరూవాడకోడైకూసింది.

నాకేడవ సంవత్సరం. సంధి వచ్చింది. వైద్యుడువచ్చి యీ బిడ్డ మరణించాడని చెప్పినాడు. అపుడు స్వామి "ఇదిగో! వైద్యుడుగారూ! ఈ నా ప్రథమపౌత్రుడు మరణిస్తే ఆ వేణుగోపాలుని విగ్రహంతో కూడ కృష్ణానదిలో కలిసిపోతా!" అని రేయి తొలిసందెయందు "ఆపదుద్ధారక' మంత్ర జపానికి పూనుకొని, తెల్లవారుజామునకు వేలపర్యాయములు చేశారు. నేను తెల్లవారుజామునకు "అమ్మా! ఆకలి" అని అరిచానట. ఉదయం వైద్యుని పిలిపించి చూపించగా, "మా వైద్యశాస్త్రప్రకారం పిల్లవాడు మరణించినాడు. కాని మీ శక్తి మాకు తెలిసినదిగాదు. ఇప్పుడు పిల్లవానినాడి, గుండె కొట్టుకొనుట సక్రమముగానున్న"వని చెప్పిపోయెనట.

ఇట్టి అపూర్వసంఘటనలు వారి జీవితాన వందలు, వేలు. ప్రత్యేకముగా వ్రాసినచో నొక బృహద్గ్రంథమగును.

వారికేదైన జబ్బుచేసినచో, తన యిష్టదైవతముమీద ఒక గ్రంథము వ్రాయుట, ఆ వ్యాధిని నిర్మూలించుకొనుట చేసెడివారు. 'శ్రీ సీతారామప్రభావము'

'గోపికావిలాసము' లక్ష్మీసహస్రమువంటి పద్యగ్రంథములావిధముగా రూపుదిద్దుకొన్నవే.

ఆయన ప్రతివిషయమును దైవమహిమగా భావించెడివారు. ఒక పుస్తకములో నొకరూపాయి కన్పించినచో "ఎప్పుడు పెట్టాడో! వాడు" అని దైవమాయగా భావించేవారు. మీరేపెట్టి మఱచిపోయి ఉంటారని ఎవరైన అంటే ఇక ఆయన కోపానికంతుండేదికాదు. ఏదైనా సమస్యతో బాధపడునపుడు నేరుగా ఆలయనానికి వెళ్ళి 'సంతానవేణుగోపాలస్వామి'తో మానవునితో పోట్లాడినట్లు పోట్లాడేవారు. పొడముకాయ కన్పించకపోతే దైవమహిమ.

వారి తపస్సుచేసేవేళ విశ్వాన్ని మరచిపోయేవారు. వారు మోదుమూడి గ్రామమున భాగవతపురాణమును చెప్పుచు 21వ దినమున పరీక్షిన్మహారాజువలె దివ్యవైకుంఠపదమలంకరించారు. స్వయంగా హరికథలు వ్రాసి చెప్పేవారు. కిన్నెరగాత్రం. దూరశ్రవణయంత్రాలు లేనికాలంలో రెండు మూడు మైళ్లు విన్పించేటట్లు కథ చెప్పటం, అందరికీ తెలిసిన సత్యం.

ఈ భద్రాచలరామభద్రశతకంలో రాముని ధనంకోసం యాచించినట్లు ఎన్నో పద్యాలలో వ్రాశారు. అదివారి సుఖాలకు కాదు. కేవలం దేవాలయాభివృద్ధికి. తిరుమల-భద్రాద్రి దేవాలయాలవలె పూడివాడ వేణుగోపాలస్వామి ఆలయాన్ని వృద్ధి చేయాలని వారి ఆకాంక్ష. దానికొఱకే అర్థాన్ని వాంఛించారు.

ఈ రెండు శతకాలను కేవలం ఆలయాభివృద్ధి చేయుమని అర్థించుటకే వ్రాశారు. వీనిని ఎందులకో ముద్రించలేదు. మిగిలినవారి పద్యరచనలోని ప్రౌఢశైలి లేదని భావించారో, ధనంలేక విడిచిపెట్టారో తెలియదు. ఇందలి ప్రతిపద్యం వారికవితాశైలికి పొండితీప్రకర్షకు నికషోపలం. వీనికి పూర్తిగా వ్యాఖ్య వ్రాయాలంటే పెద్దగ్రంథమే ఔతుంది. చాలక్లుప్తంగా మాత్రమే వ్రాశాను.

వారు నన్ను వారు స్థాపించిన శ్రీభాష్యకార సమాజానికి, వేణుగోపాల సేవాశ్రమానికి అధిపతిని చేయాలని ఊహించారు. అందువల్ల తన పుత్రులవలె

కేవలం సంస్కృతాంధ్రాలే చదివించాలని తలపోశారు. చిన్నతనంలోనే సంస్కృతం, భట్టుమూర్తి వసుచరిత్రలోని పద్యాలను నేర్పించటానికి ప్రయత్నించారు. కాని నాటికి ఆస్తులు పెద్దగాలేవు. ముందు కుటుంబపోషణ. అందువలన మా నాయనమ్మగారుమాత్రం ఈనాటి ఆంగ్లవిద్యలు నేర్పించాలని పట్టుపట్టింది. మా తండ్రిగారు నన్ను ఉన్నత పాఠశాలలో చేర్చినపిదప మా పితామహులు నన్నంతగా పట్టించుకోలేదు. కాని మహాత్ముల ఆశయాలు, ఆకాంక్షలు వ్యర్థం కావు కదా! చివఱకు తిరిగి తిరిగి నేను వారు భావించిన స్థానానికే వచ్చాను విద్యావిషయికంగా. తెలుగు పండితునిగా, కవిగా ఉపన్యాసకునిగా ఎదిగాను.

ఆయన వాక్కు అలాంటిది. ఆయనకోడళ్ళతో "ఇదిగో! నేను ఆర్థికంగా డబ్బెక్కువ ఇవ్వలేదని బాధపడవద్దు. ఈ ప్రక్కనే దేవాలయంలో ఒక నిధిని నిక్షేపించాను. మీకు అన్నవస్త్రాలకెట్టి పరిస్థితులలోను లోపంరాన్విదు"అని చెప్పిన సందర్భాలు నాకు తెలుసు. ఈనాటికీ ఈ కుటుంబాలకావిధంగానే సాగిపోతున్నది.

ఆయన జ్యేష్ఠపుత్రులే శ్రీమాన్ శ్రీనివాసపెరుమాళ్లుగారు. వారు తర్కవేదాంత పండితులు. పురాణప్రవచనంలో సాటిలేని అద్వితీయ ప్రతిభా సంపన్నులు. సాహిత్యంలో ఎంతో పట్టున్నవారు. తండ్రిగారి మార్గాన్ని నూటికి నూరుశాతం పాటించిన మహావ్యక్తి. నిరంతరం వేణుగోపాలస్వామివారి దేవాలయాభివృద్ధినిగూర్చి కలలుకన్నారు. ఆ దేవాలయంలో తొలిసారి బ్రహ్మోత్సవాలు నిర్వర్తించటానికి పాదులు తీశారు. వారి అర్ధాంగిలక్ష్మి సాధ్వీతిలకం బాలమాంబ. ఆవిధంగానే ఒక మహాయజ్ఞం నిర్వహించటానికి దీక్షవహించి సోదరుల సహకారాన్నిపొంది జగజ్జేగీయమానంగా పూర్తిచేశారు.

వారు రచించినదే శేషనగేశస్తవం. వారు వేంకటేశ్వరస్వామిభక్తులైన కారణంగా ఆ కావ్యాన్ని రచించారు. తరువాత రామానుజ చరిత్ర మొదలు దివ్యసూరి చరిత్ర. ఆచార్యహృదయమనే మూడు వచన గ్రంథాలను రచించారు.

అవి ప్రజలలో బాగా వ్యాప్తిని పొందాయి. వారికి ఆస్తులపై వానిపెంపకం మొదలైన విషయాలలో ఆసక్తి ఏమాత్రం లేదు. డెబ్బదిరెండు సంవత్సరాలవయస్సులో ఒకనాడు స్వామికి ప్రపత్తిచేసివచ్చారు. ఇకతాను మూడు రోజులకు దివ్యధామానికి వెళ్లుచున్నానని శిష్యులనందరినీ పిలిపించారు. ఆయనే స్వయంగా చాపపరచుకొని, శిష్యులందరు చుట్టూచేరి భగవన్నామం చేస్తుండగా భక్తులసాక్షిగా రామా! రామా! అంటూ యోగమార్గంలో ప్రాణాలు విడిచి పరంధామం చేరారు. ప్రపంచమంతా ఆశ్చర్యపోయింది. చెప్పి అందరూ చూస్తుండగా ప్రాణములను వదలిన మహాత్ములెక్కడో కొలదిమంది ఉంటారు. వారు సిద్ధపురుషులు. వీరాకోవకు చెందినవారు. రామాయణ భారతభాగవత పురాణాలను శతాధికప్రదేశాలలో నిర్వహించారు. మహర్షివేంకటదాసస్వామి వారుండగనే కొన్ని ఉత్సవాలు ఏర్పాటు చేశారు. వారి తదనంతరం వారి పుత్రులు తర్కవేదాంతపండిత శ్రీనివాసపెరుమాళ్లు, శ్రీ వేంకటాచలపతి కవిభట్టారకదాశరథిసూరి శ్రీ రామప్రసాదుగారలు పెంపొనరించుటకు ప్రయత్నించిరి.

ఇప్పుడా ఆలయనిర్వహణ వారి పౌత్రులచే కొనసాగించబడుచున్నది. తద్వైభవంభవిష్యత్కాలం నిర్ణయించునుగాక.

రామా! రామ! యటంచు మోక్షమును జేరంబోయె - శిష్యప్రజా
క్షేమస్ఫూర్తిఁ దలంచి బోధనల సుశ్రీమార్గముం జూపి, శ్రీ
రామాంఘ్రిద్వయపద్మమగ్న హృదయప్రఖ్యాతుఁడై కీర్తి విష
స్తారుండైన మహాత్ము తండ్రిపదకంజాతంబులర్చించెదన్

నారీలోకమునందు సాధ్వియనఁగన్ బ్రఖ్యాతిగైకొన్న శ్రీ
క్షీరాబ్ధీశ్వర పుత్రికన్నియెడలన్ జేదోడు వాదోడనన్
బేరుంగాంచిన బాలమాంబ జననిన్ జేతంబునన్నిల్పినే
నారాధించెద శ్రీనివాసపెరుమాళ్లాఖ్యున్సదాతండ్రినిన్.

ఎలాగైనా దీనిని ముద్రించితీరాలని నిరంతరం ప్రోత్సహించిన నా ధర్మపత్ని చి॥సౌ॥ పద్మాలయాదేవి.

మా తాతగారు రచించిన రెండు శతకాలను సంపాదించి ఓర్పుతో వానిని తన శక్తికి తగినట్లుగా వ్రాసియిచ్చినవాడు తమ్ముడు చి॥ కృష్ణప్రసాదు.

ఈ కార్యక్రమమునకండదండలందించిన సోదరులు చి॥ యతిరాజ సంపత్కుమారుడు చి॥ జనార్దనస్వాములను మా తల్లిదండ్రులకరుణావర్షం నిత్యం ముంచియెత్తునుగాక.

ఈ గ్రంథముద్రణకు విరాళములిచ్చి సహకరించిన నా కుమారుడు చి॥ పద్మావతీవరప్రసాదు భార్య చి॥ల॥సౌ॥ ఉపేంద్రాణి వారి కుమార్తె చి॥ యోగరామగాయత్రి రూ. 10,000-00.

నా కుమార్తె చి॥ల॥సౌ॥ అవనిజ భర్త చి॥సనకా శ్రీనివాస్ వారి కుమారుడు చి॥ అనిరుధ్‌రాజచంద్ర రూ. 10,000-00.

నా కుమార్తె చి॥ల॥సౌ॥ కుముదవల్లి భర్త చి॥ సింహాద్రి మోహన్ వారి కుమారులు చి॥ నాగసమీరనందన్, చి॥ శ్రీరామకౌశల్ రూ. 10,000-00. వీరికి శ్రీ భద్రగిరీశుడు, వేణుగోపాలుడు శ్రీనివాసపరబ్రహ్మములు అఖండాయురారోగ్య సర్వసంపద్భోగభాగ్యములొసంగి సర్వదా రక్షింతురుగాక.

ఈ గ్రంథాన్ని ఇంతచక్కగా డి.టి.పి. చేసిన శ్రీ కామరాజుగడ్డ శివాంకపోతురాజుగారికి, లక్ష్మి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, రేపల్లెవారికి నా ధన్యవాదములు.

రేపల్లె,
ఖర-ఆషాఢం

ఇట్లు
వైష్ణవాంఘ్రిరేణువు
మొవ్వ వృషాద్రిపతి

# శ్రీ భద్రగిరిరామభద్రశతకము

శ్రీరామ! జయరామ! శృంగారరామ! స
త్యాదికల్యాణ గుణాభిరామ!
త్రిజటభూసురవిభూతిప్రదాయకరామ!
ధరసుతాపతిచాపదళనరామ!
మునివధూశాపవిమోచన శ్రీరామ!
దశరథభారతీత్రాణరామ!
శబరీఫలాహారజనితసమ్మదరామ!
పరశురామావలేపహర! రామ!

హనుమదర్చిత దివ్యపాదాబ్జరామ!
సోదరత్రయమానసాహ్లాదరామ!
భువనమోహనరామ! కర్బురవిరామ!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 1

**తాత్పర్యము :** ఓ శ్రీరామ! ఓ జయరామ! శృంగారరామ! సత్యము జ్ఞానము మొదలైన కల్యాణగుణములతో ప్రకాశించు రామా! మునీశ్వరులైన బ్రాహ్మణులకు జ్ఞానాన్ని ఇచ్చు ఓ రామా! శంకరుని ధనుస్సును విరిచిన రామా! అహల్యాశాపమును పోగొట్టిన రామా! దశరథునివాక్కును అనగా శపథవాక్కును రక్షించిన రామా! శబరియిచ్చిన ఎంగిలిపండ్లు ఆహారముగా స్వీకరించి ఆనందించిన రామా! పరశురాముని గర్వమును హరించిన రామా! హనుమంతునిచే పూజింపబడిన దివ్యపాదారవిందరములుగల రామా! లక్ష్మణభరతశత్రుఘ్నులను సోదరులకు సంతోషమిచ్చు రామా!

లోకములకన్నింటికిని మోహమును కలిగించు రామా! రాక్షస సంహారకుడవైన రామా! భద్రగిరిమీద నివసించు రామా! భద్రములిచ్చు కృపకు సముద్రము వంటివాడా!

అఖిలశాస్త్రోక్త ప్రాయశ్చిత్తములకు లొం
గనిపాతకములఁ జెయ్యనడంచి
నిఖిల జన్మములందు నీరంధ్రముగ లేచు
నాపత్తులను లీలరూపుమాపి
సారతరౌష ధాసాధ్యమై బాధించు
దారుణ రుజల-గ్రద్దన నడంచి
వితతంబులైయనారతము సిక్కులఁబెట్టు
దారిద్ర్యచయముల పేరుమాపి

భూమిపైఁ గీర్తిఁగాంచు నీ రామమంత్ర
మెపుడు నా జిహ్వనటియింపనిమ్ము దేవ!
కాంక్షల ఫలింపఁజేయుమీ! కౌసలేయ!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 2

**తాత్పర్యము :** ప్రాయశ్చిత్తములు చేసికొనినను నశింపని ఘోరపాపములను వెంటనే పోగొట్టి ఎన్నో జన్మలలో ఎదురైవచ్చిన ఎన్నో కీడులను లీలగా పోగొట్టి, శ్రేష్ఠమైన ఔషధములకు లొంగని మహారోగములను వెంటనే పోగొట్టి, అధికమై ఎల్లప్పుడు బాధలను కల్పించు దారిద్ర్యమును పూర్తిగా పోగొట్టి రామమంత్రము భూమిపై ప్రఖ్యాతిగన్నది. అట్టి రామమంత్రమెల్లపుడును నా నాలుకపై కదులుచుండనిమ్ము. ఓ కౌసల్యాపుత్రా! నా కోరికలను ఫలింపచేయవలసినది. సీతారామా! ఈ అనంతబ్రహ్మాండాలకు సార్వభౌముడా! భద్రగిరిపై నివసించు రామా! శ్రేష్ఠమైన దయకు సముద్రుడా!

వాల్మీకి జిహ్వాపై వర్తించి తరువాత
రామాయణాఖ్యతో రహిజనించి
కవివర్యులకు సూరికాండంబులకును వి
ద్యాప్రదంబైసదా ఖ్యాతిఁగాంచి
వసుధామరులకు దేవతలకుఁ బారాయ
ణార్హమైశ్రుతి నిభంబైచెలంగి
వక్తలకును శ్రోతృవర్గంబులకు నోలి
మితిలేని భోగసంతతులొసంగి

వెలయు నీ రామనామ మిమ్ముల మదీయ
రసనపై నిల్పుమయ్య నిరంతరంబు !
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 3

**తాత్పర్యము :** రామనామ మహిమ వివరింపబడుచున్నది. తొలుత వాల్మీకి నాలుకమీద సంచరించి, తరువాత రామాయణకావ్యముగా భూమిపై జన్మించి పండితులకు కవులకు విద్యలనొసంగునదియై, లోకప్రఖ్యాతినిపొంది, బ్రాహ్మణులకు, దేవతలకు ఎల్లప్పుడు పారాయణగ్రంథమై వేదసన్నిభమై ప్రకాశించి వక్తలకును, వినువారికిని, పరిమితిలేని భోగసమూహములను ఇచ్చి ప్రకాశించు నీ రామనామమును, నా నాలుకపై నిలుపవలసినది. ఓ సీతారామా! బ్రహ్మాండములకు సార్వభౌముడవైనవాడా! భద్రాచలవాసా! క్షేమములనిచ్చు దయకు సముద్రుడా!

జనకాజ్ఞఁగొని రాజ్యమును వీడి కాననాం
తరముఁజేరిన నీయుదారగుణము
సుగ్రీవునకు రాజ్యసుఖమిచ్చి ధరణీధ్ర
గుహావసించిన భవత్సహనపూర్తి

పంక్తికంధరునిఁజంపకమున్నె దత్సహో
దరురాజుఁజేసిన ధైర్యమహిమ
రణములో దస్సిన రావణాసురునిఁ బో
మ్మనియూరడించిన యార్తరక్ష

ణాతిశయమిట్టిదనిచెప్పనాశయంబు
నందుయోజింపఁదరమె? మహానుభావ!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 4

**తాత్పర్యము :** తండ్రియైన దశరథమహారాజు అజ్ఞప్రకారము రాజ్యమును విడిచి పదిరెండేండ్లు అరణ్యవాసముచేసిన నీ ఉదారగుణము – సుగ్రీవునకు రాజ్యసౌఖ్యములు ప్రసాదించి పర్వతగుహలో వర్షకాలమంతయు నివసించిన నీ సహన (ఓర్పు) శీలత– రావణుని చంపుటకు ముందుగనే ఆతని సోదరుడైన విభీషణుని లంకారాజుగా పట్టాభిషిక్తు చేసిన ధైర్యగుణము. యుద్ధమునం దలసిపోయిన బలవద్వైరియగు రావణాసురుని, చంపక తిరిగి లంకకు పొమ్మని ఓదార్చిన నీ యార్తజనరక్షావిధి – ఇటువంటివని చెప్పుటకు నాకు సాధ్యముకాదు. ఓ మహానుభావా! సీతారామా! బ్రహ్మాండములకు సార్వభౌముడా! భద్రగిరియందు నివసించువాడా! భద్రకృపకు సముద్రుడా!

భవదవతార వైభవవర్ణనాప్తిచే
రామాఖ్య తారకనామమయ్యె
భవదీయ జన్మసంప్రాప్తిచే రఘుకులం
బత్యంత పావనంబైచెలంగెఁ
దావకీనాంఘ్రిరాజీవాప్తిచే ముక్తి
దంబయ్యె నయ్యయోధ్యాపురంబు

తావకదర్శనోదారపుణ్యముచేతఁ
గోసల ప్రజలు గైకొనిరిముక్తి
అట్టి నీ రామనామ మాహాత్మ్యమెఱిఁగి
కొలుచువారలకెందైనఁ గొఱఁతలున్నె
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 5

**తాత్పర్యము :** నీ యొక్క అవతారవైభవవర్ణన వలన, రామనామము తారక (సంసారసముద్రమును దాటించు) నామమైనది. నీవు జన్మించిన హేతువువలన రఘువంశము మిక్కిలి పవిత్రమైనది. నీ పాదపద్మరజమును పొందినకారణమున అయోధ్యానగరము ముక్తి నొసంగు పట్టణమైనది. నీ దర్శనమగు గొప్ప పుణ్యముచేత కోసలదేశ ప్రజలందఱును మోక్షసిద్ధిని పొందిరి. అటువంటి నీ నామమాహాత్మ్యంబు తెలిసి నిన్ను సేవించువారికి లోపములుండునా? జానకీరామా! బ్రహ్మాండములకు చక్రవర్తీ! భద్రాద్రిపై నివసించు రామా! క్షేమములిడుకృపకు సముద్రుడా!

గర్భదరిద్రుఁడై కడుపారమెక్కంగఁ
గూరలోదనముఁ జేకూర్పలేక
క్షుద్బాధచేతఁదా శుష్కించి పిల్ల లే
డ్పింపఁగా శోకమాలింపలేక
తైలమాభరణముల్చేలముల్లేవంచు
నాలుకూవెట్ట నూరార్పలేక
విక్రయార్థంబౌవివిధశుష్కదారవుల్
దెగికానలందు ఛేదింపలేక
నిరతము కృశించు త్రిజటభూసురునకఖిల
సంపదలొసంగినావు తత్క్షణమునందు

జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!

భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 6

**తాత్పర్యము :** పుట్టుకనుండి దారిద్ర్యమువలన కడుపునిండ తినుటకు, అన్నమును, కూరలను తెచ్చుకొనలేక, ఆకలిబాధతో తాను కృశించి, పిల్లలాకలిబాధకు తట్టుకొనలేక దుఃఖించుచుండగా వారి శోకమును విని భరించలేక, తలకు నూనెగాని, నగలుగాని, వస్త్రములుగానిలేవని భార్యబాధపడుచుండగా ఆమెను ఓదార్చలేక, ఎండుకట్టియలుకొట్టి తెచ్చి అమ్ముకొని జీవించుటకు, అరణ్యములలో ఎండుచెట్లను కొట్టలేక, నిరంతరము చిక్కిపోవుచున్న త్రిజటుడను బ్రాహ్మణునకు సమస్త సంపదలిచ్చితివి. ఓ జానకీరామా! బ్రహ్మాండ సార్వభౌమా! భద్రగిరియందు నివసించువాడా! దయకు సముద్రమైనవాడా!

రాముడు వనవాసమునకేగుచుండెను. బ్రాహ్మణులందఱకు తన ధనములను విరివిగా దానముచేయుచుండెను. ఆ విషయమునువిని త్రిజటుడను నిఱుపేద బ్రాహ్మణుడు కృశించిన దేహముతో చిరిగినగుడ్డలతో, ఆలితోకూడివచ్చి రామునర్థించెను. ఆతడు మహాబలశాలియని రాముడు వినియుండుటచే ఆయనను చూచి "భూసురోత్తమా! అదిగో వేలకొలది ఆవులు సరయూనదీ తీరమున మేయుచున్నవి. అవి అన్నియు నావియే. మీరు బలవంతులని వినియుంటిని. మీరు కఱ్ఱను విసరుడు. అది ఎంతదూరమునపడునో, అంతవఱకున్న గోవులన్నియు మీరు గ్రహింపుడు"అని చెప్పెను. వెంటనే త్రిజటుడు పంచె బిగించి, నడికట్టు బిగించి, కఱ్ఱను గిరగిర త్రిప్పివిసరెను. ఆ కఱ్ఱపోయి సరయూ తీరమున మేయుచున్న గోవులకావల పడెను. రాముడచ్చెరువుతో "ఆర్యా! మీ శక్తిని చూడవలయునని కోరితినేకాని. అన్యము కాదు. క్షమింపుడు" అని ఆ గోవులనన్నింటిని ఆయనకిచ్చి పంపెను.

దేవరాతాది మహీవల్లభులచేతఁ

బ్రతివాసరంబు సపర్యలొంది

భూచక్రమునఁగల రాచవారరుదెంచి
చోలిపైకెత్తంగ వీలుగాక
ఈ చాపమెత్తువాఁడింకఁ బ్రాప్తించునే
యని జనకప్రభుండార్తిఁజెంద
పదివేలమంది బల్లిదులొకబండిపై
నిడిక్రియావసరమందీడ్చుచుండ
ఘనతఁగాంచిన శివకార్ముకముబిరాన
విఱిచినభవద్బలంబు భావింపఁదరమె?
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 7

**తాత్పర్యము :** దేవరాతుడు మొదలైన భూపాలకులచేత, ప్రతిదినమును సేవింపబడుచు, భూచక్రమునగల రాజులందఱును వచ్చి పైకి ఎత్తుటకు సాధ్యముకానిది, ఇక యీ ధనుస్సును ఎత్తగలవాడు కలడో? లేడో? అని జనక మహారాజు ఆర్తిని చెందుచుండగా, పదివేలమంది మహాబలాఢ్యులు ఒక బండిమీదనుంచి ఈడ్చుకొనివచ్చు శివధనుస్సును లీలగా గోగుపుల్లవలె విఱిచిన రామా! నీ బలమిట్టిదని నిర్ణయించుటకు సాధ్యమా! జానకీరామా! బ్రహ్మాండ సార్వభౌమా! భద్రగిరిపై ఆవాసముండువాడా! దయకు సముద్రుడా!

పూర్వము దేవతలకు, మునీశ్వరులకు, శివకేశవులలో ఎవ్వరధికులు? అను సందేహము కలిగినది. ఆ సందేహనివారణార్థమై విశ్వకర్మ రెండు ధనుస్సులను చేసెను. అందొకటి హరికి, మరియొకదానిని హరునకు ఇచ్చిరి. వారిలో కలహమును ప్రేరేపించిరి. మహావిష్ణువుచేసిన హుంకారముచే శివునకు చేతులాడక, దిక్కులు చూడదొడగెను. అపుడందఱును విష్ణువే ఘనుడని నిర్ణయించిరి. శివుడు ఆ ధనుస్సును నిమివంశస్థుడైన దేవరాతునకిచ్చెను. అతని దగ్గరనుండి ఆ ధనుస్సు ఆ వంశస్థులచే పూజింపబడుచు జనకుని తరమున

రామునిచే విరువబడినది. విష్ణువు తన ధనుస్సును జమదగ్నికిచ్చెను. అదియే వైష్ణవధనుస్సు. దానిని పరశురాముడు ధరించెను.

రాజాధిరాజ వారములకు సేవ్యమై
వింతగాఁదోఁచు లతాంతధూళి
సకలసువాసినీ జనసంఘములచేత
గౌరవంబొందు శ్రీఖండధూళి
పరమవైష్ణవఫాలభాగస్థమై సదా
సొబగారుచున్న శ్రీ చూర్ణధూళి
నిర్జరావళులకు నీరాజనార్హమై
పొలుపారు విమల కర్పూరధూళి

శిలనహల్యాసతినిఁ జేసివెలయుతావ
కాంఘ్రిరాజీవధూళితుల్యములుగావు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 8

**తాత్పర్యము :** రాజాధిరాజులు గౌరవించు పూవుల పుప్పొడికన్న, పుణ్యస్త్రీలు ఎల్లప్పుడు తమ శరీరాలకు పూసికొనెడి మంచిగంధపుపొడికంటెను వైష్ణవులు ముఖము నందుంచుకొను ఊర్ధ్వపుండ్రమునందలి, శ్రీ చూర్ణపు ధూళికన్నను, దేవతలకు గౌరవముగా అర్పించు కర్పూరములోని రజముకన్నను, రాయిగామారిన అహల్యను మరల స్త్రీగా మార్చిన నీ పాదపద్మములందలి ధూళిగొప్పది. జానకీరామ! బ్రహ్మాండ సార్వభౌమ! భద్రగిరిపై వసించువాడా! భద్రము లిచ్చుకృపకు సముద్రమువంటివాడా!

అహల్యపై వ్యామోహముతో అర్ధరాత్రమువేళ దేవేంద్రుడు కోడిపుంజు రూపమునవచ్చి కొక్కొరోకోయని యఱచెను. తెల్లవారనున్నదని భావించి ఆమె

భర్త గౌతమమహర్షి లేచి నదికి స్నానార్థమై అరిగెను. అపుడింద్రుడు గౌతమ వేషమున ఆశ్రమమున ప్రవేశించెను. అహల్య ఆతడింద్రుడని భావించుకొని, తన జన్మధన్యమైనదని భావించి ఆయనతో రతిసుఖమనుభవించెను. ఎంతకు తెల్లవారకపోగా గౌతముడు జరిగిన వృత్తాంతమును దివ్యదృష్టితో తెలిసికొని ఆశ్రమమునకు వచ్చెను. వెడలిపోవుచున్న ఇంద్రుని నీ ముష్కము తెగిపోవుగాకయని శపించెను. అహల్యను రాయివైపొమ్మని శపించెను.

విశ్వామిత్రుడు జనకుని ధనుర్యాగమును చూచుటకు, మిథిలకు రామలక్ష్మణులను తీసికొనిపోవునపుడు దారిలో గౌతమాశ్రమమునకు వారిని తోడ్కొని వచ్చెను. రామపాదరజముసోకి అహల్య మరల నిజస్వరూపమును పొందెను.

వాల్మీకి రామాయణమున గౌతముడు రాయివి కమ్మని శపించినట్లులేదు. ఇంద్రుడు కోడిపుంజుగావచ్చి కూసినట్లును లేదు. కొన్ని రామాయణములలో నున్నది.

**విధిపుత్త్రుండై తపోవిభవాఢ్యుండైన య**
**రుంధతీనాథుఁ బోరునదల్చి**
**ఘనుత్రిశంకు నిమిత్తమని ఋషుల్వెఱగంది**
**కనఁగా ద్వితీయ నాకంబొనర్చి**
**నిజతపోవిఘ్నంబు నెఱపంగదాసిన**
**రంభాసురూపంబు రాయిఁజేసి**
**చేరిమ్రొక్కిన శునశ్శేపునిమఖ పశు**
**త్వముమాన్పి ప్రాణముల్దాపఁజేసి**

**ఖ్యాతిఁగాంచిన కౌశికుచేతఁగాని**
**సవనమును బ్రోచినావు ప్రశస్తిమీర**
**జానకీరామ! బ్రహ్మాండ సార్వభౌమ!**
**భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర!** 9

**తాత్పర్యము :** జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమా! భద్రగిరిమీద నివాసమున్న రామభద్రా! దయకు సముద్రుడా! బ్రహ్మకు మానసపుత్రుడై అధికతపస్సుచే ప్రసిద్ధుడైన అరుంధతీభర్తయగు వసిష్ఠుని యుద్ధమునందు అదల్చి, త్రిశంకు మహారాజుకొఱకు దేవతలందరాశ్చర్యముతో దర్శించుచుండ రెండవ స్వర్గమును సృష్టించి, తన తపస్సును చెఱచుటకు వచ్చిన రంభను రాయివి కమ్మని శపించి, రక్షింపుమని ప్రార్థించిన మేనల్లుడు శునశ్శేపుని, యజ్ఞపశుత్వమునుండి తప్పించి ప్రాణములు రక్షించి, ప్రసిద్ధిచెందిన విశ్వామిత్రునివలన కాని ఆయన యజ్ఞమును పూర్తిచేసితివి.

విశ్వామిత్రుడు రాజ్యపాలన చేయునపుడు సైన్యములతో వసిష్ఠుని ఆశ్రమమునకు వచ్చెను. వసిష్ఠుడు తన నందినీ ధేనువును నియోగించి, విశ్వామిత్రునకు తత్సైనికులకు గొప్ప విందును చేసెను. విశ్వామిత్రుడా ధేనువును తనకిమ్మనియెను. వసిష్ఠుడంగీకరింపకపోగా విశ్వామిత్రుడు వసిష్ఠునితో ఎన్నో పర్యాయములు పోరాడెను.

త్రిశంకు నృపాలుడు తనను సదేహముగా స్వర్గమునకు పంపు యజ్ఞమును చేయింపుమని తన పురోహితుండగు వసిష్ఠుని వేడెను. అది సాధ్యముకాదని ఆయన తిరస్కరించెను. త్రిశంకువు వసిష్ఠపుత్రులకడకేగి తనచే సశరీరముగా స్వర్గమునకు పోవు యజ్ఞమును చేయింపుమని కోరెను. వారు కోపించి 'మా తండ్రి కాదనగా కాదని మా దగ్గరకు వచ్చి రహస్యముగా అడిగితివి కాన నీవు ఛండాలుడవు కావలసినది.' అని శపించిరి. అతడు వచ్చి విశ్వామిత్రు నాశ్రయించెను. విశ్వామిత్రుడట్టి క్రతువు నొనర్చి ఆ త్రిశంకువును శరీరముతో స్వర్గమునకు పంపెను. దేవతలాతనిని క్రిందకు పడద్రోచిరి. తన్ను రక్షింపుమని త్రిశంకువు మొఱపెట్టెను. విశ్వామిత్రుడు తన తపశ్శక్తితో స్వర్గమునకు దిగువ త్రిశంకు స్వర్గమనునొక స్వర్గమును సృష్టించెను.

విశ్వామిత్రుడు హిమాలయ పర్వతములకేగి ఘోరతపస్సాచరించు చుండెను. ఆ తపస్సునకు భయపడి దేవేంద్రుడు విశ్వామిత్రుని తపోభంగ

మొనర్చుటకు రంభను పంపించెను. క్రోధముతో విశ్వామిత్రుడామెను రాయివై పొమ్మని శపించెను.

అంబరీషుని అశ్వమేధాశ్వము దొంగిలింపబడెను. కనుక యజ్ఞపశువుగా నొక బ్రాహ్మణబాలకుడు కావలసివచ్చెను. విశ్వామిత్రుని అక్కగారు సత్యవతి. ఆమె భర్త ఋచీకుడు. వారి దగ్గఱకు వెళ్ళి తమ పుత్రులలో ఒక్కరిని యజ్ఞపశువుగా నిచ్చినచో లక్షధేనువులనిత్తుమనిరి. ఋచీకుడు నేను పెద్దకుమారుని విడువలేననెను. తల్లి చిన్నకొడుకు నొసంగజాలననెను. మధ్యముడైన శునశ్శేపునకు విరక్తి కల్గి ఆ ధేనువులను తల్లిదండ్రులకిప్పించి, తాను యజ్ఞపశువుగా అంబరీషుని వెంట బయలుదేరెను. మార్గమధ్యమున విశ్వామిత్రుని ఆశ్రమమున్నది. ఆయనను చూచి శునశ్శేపుడు దుఃఖముతో ఆయనను శరణువేడెను. ఆతనికి అభయమిచ్చి విశ్వామిత్రుడు తన కుమారులలో ఒక్కరిని యజ్ఞపశువుగా పొమ్మనెను. వారు నిరాకరించిరి. విశ్వామిత్రుడు వారిని భయంకరముగా శపించి, శునశ్శేపునకు నొకమంత్రమును చెప్పి బలి సమయమున నీమంత్రమును జపింపుమనెను. ఆతడట్లే చేసెను. వెంటనే ఇంద్రుడు ప్రత్యక్షమై యజ్ఞభాగము తమకు చెందెనని శునశ్శేపుని విడిపించెను.

ఇన్ని ఘనకార్యములు చేసిన విశ్వామిత్రుడు తన యజ్ఞమును రక్షించుకొనలేకపోయెను. దానిని రాముడు రక్షించెనని భావము.

కార్తవీర్యార్జును ఘనకుటుంబముతోడ
రణమునఁగూల్చు పరాక్రమంబుఁ
దలరముయ్యేడు మారులు భూపతులనెల్ల
సంహరించిన భుజాశౌర్యపూర్తి
మున్నెన్నడైనను దన్నెదిర్చి జయించు
నతఁడు లేఁడనెడు గర్వాతిశయముఁ

దనదేశికుని ధనుర్దళనంబుఁగావించు
నపరాధి దండింతునను ప్రతిజ్ఞ
తెరలిపోవంగ గడియలోఁ బరశురాము
గెలిచి నీ భుజాశౌర్యంబుఁ దెలిపినావు
జానకీరామ! బ్రహ్మాండ సార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 10

**తాత్పర్యము :** కార్తవీర్యార్జునుని, కుటుంబసహితముగా యుద్ధములో సంహరించిన పరాక్రమము, ఇరువదియొక్క పర్యాయములు భారతదేశమంతయు పర్యటించి రాజులనందరిని సంహరించిన పరిపూర్ణశౌర్యమును, తననెదిరించి జయింప గలవాడు ధరణిలో మరియొక్కడు లేడనుగర్వమును, తన గురువగు శంకరుని ధనుస్సు విరిచినవానిని దండించెదనని చేసిన ప్రతిజ్ఞయు వ్యర్థమయి పోవునట్లు గడియలో పరశురాముని జయించి, రామా! నీ బలశౌర్యప్రతాప ములను తెలియజేసితివి. జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ! భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర!

మాహిష్మతీ నగరమున రాజధానిగాచేసికొని కార్తవీర్యార్జునుడు పాలించు చుండెను. అతడు దత్తాత్రేయుని భక్తుడు. ఆయన కరుణచే వేయి చేతులను పొందెను. అతడు సైన్యములతో అరణ్యములకుబోయి జమదగ్ని మహర్షిని దర్శించుటకు తదాశ్రమమునకు పోయెను. జమదగ్ని మహర్షి తన హోమధేనువుచే, కార్తవీర్యునకు, ఆతని పరివారమునకు వలయు ఆహారమును, అతిథిసపర్యలను చేయించెను. అదిచూచి ఆ ధేనువును తనకిమ్మని కార్తవీర్యుడు జమదగ్నిని కోరెను. అతడు నిరాకరించెను. కన్నుగానని మదగర్వముతో ఆతడు ధేనువును బలవంతముగా కొనిపోవుచుండెను. అందులకు జమదగ్ని మహర్షి అడ్డువచ్చెను. కార్తవీర్యుని సైనికులు జమదగ్నిని సంహరించిరి. ఆ సన్నివేశమును చూచి భరింపలేని దుఃఖముతో జమదగ్ని భార్య రేణుక,

ఏడు పర్యాయములు గుండె బాదుకొని, మూడు పర్యాయములు పరశురాముని పిలిచెను. భృగుమహర్షివచ్చి కుమారుడగు జమదగ్నిని బ్రతికించెను. పరశురాముడు వచ్చి హైహయవంశజులయిన కార్తవీర్యుని అతని సంతానమును రణరంగమున సంహరించెను. ధేనువును కొనివచ్చెను. మూడుసార్లు పిలిచి, ఏడు పర్యాయములు రొమ్ము బాదుకొన్నది గనుక తల్లివేదన మాన్పుటకు (7×3=21) ఇరువది యొక్కమారులు దేశమంతయు సంచరించి, రాజులనందరిని సంహరించెను. కురుక్షేత్రమునశ్యమంతక పంచకమున తాను ఏర్పాటుచేసిన రక్తసరస్సులలోని రక్తముతో పితృదేవతలకు తర్పణమొనర్చెను. తననెదిరింపగలవాడీ లోకమున లేడని గర్వించెను. రామచంద్రస్వామి శివధనుర్భంగ మొనర్పగా, తన గురువగు శివుని ధనుస్సును విరిచిన అపరాధి రాముని దండితుననివచ్చి ఆయనచే భంగపడెను.

ఇచ్చితిరాజ్యంబు నేలుకొమ్మని చెప్పి
తరువాత లేదన్న తండ్రమీఁద
నీకపకారంబుఁజేకూర్పఁగొండెముల్
వచియించు మంధరావనితమీఁద
భోగముల్మాని గొబ్బున నారలు ధరించి
కానకుఁ బొమ్మన్న కైకమీఁద
సరవి మంధరచేతఁ జాడీలుసెప్పింపఁ
గారణంబైన లేఖతతిమీఁద
రోషమావంతలేక సంతోషమునను
వనముఁజేరిన నీ గుణమును నుతింతు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 11

**తాత్పర్యము :** దశరథుడు రామునకు పట్టాభిషేకముహూర్తమును నిర్ణయించెను. ఆ రాత్రి ఉపవాసాదులు చేయించెను. మరునాటి ఉదయకాలమందు

రాజ్యమీయకపోగా, అరణ్యములకు పొమ్మని శిక్ష విధించెను. అట్టి తండ్రిమీదగాని, నిన్ను అరణ్యాలకు పంపుటకు మాయలుపన్ని, కైకతోలేనిపోని చాడీలు చెప్పి, అరణ్యాలకుపోవునట్లు చేసిన కైకదాసి మంధరమీదగాని, అంతవఱకు అనుభవించుచున్న రాజ్యభోగములన్నియు వదలి, వెంటనే నారచీరలు దాల్చి అరణ్యములకు పొమ్మని శాసించిన కైకమీదగాని, మంధరను ప్రేరేపించి, తాను అరణ్యములకుపోవునట్లు మంధరచేకొండెములు చెప్పించిన దేవతా సమూహముమీదగాని, కోపము కొంచెము కూడలేక సంతోషముతో అరణ్యములకేగిన నీ సద్గుణములను నుతింతును. ఓ జానకీరామా!

**అత్మస్నుషలకు మీయాడుబిడ్డల కైక**
**మత్యంబుగలదె? యో మగువలారా!**
**ధనధాన్యముఖపదార్థములు వర్థిల్లునే?**
**వరకృషీవల సార్థవాహులార!**
**స్వాధ్యాయనిపుణులై సర్వశిష్యులు మిమ్ము**
**సేవింతురే? ద్విజశ్రేష్ఠులార!**
**జారచోరానల సర్పవృశ్చికరుజా**
**బాధ లేకుందురే? పౌరులార!**

**యనిజనంబుల లాలింతువంట నరాడ**
**పత్యగర్వముమాని సంపన్నిధాన!**
**జానకీరామ! బ్రహ్మాండ సార్వభౌమ!**
**భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర!** 12

**తాత్పర్యము :** స్త్రీలు కన్పించినచో, ఓ మగువలారా! మీ కోడళ్లు కూతులు (అనగా ఆడుబిడ్డలగుదురు)ను ఐకమత్యముతో పొరపొచ్చెములులేక ప్రవర్తింతురా? ఓ రైతులారా! ధనధాన్యాది పదార్థములు వర్థిల్లుచున్నవా? ఓ వ్యాపారులారా! పదార్థవృద్ధి బాగున్నదికదా! నిరంతరము శిష్యులకు

వేదపాఠములు బోధించు గురువులారా! మీ శిష్యులు మిమ్ము సేవించుచు, అనుగమించుచున్నారా? దొంగలు, విటులు, నిప్పుపాములు, తేళ్లు మొదలైన వానివలన కలుగు బాధలు, రోగములు లేకుండ ఓ పౌరులారా! మీరు సుఖముగా నున్నారా?" అని నీ రాజ్యప్రజలను ప్రేమతో లాలింతువట రాజకుమారుడనను గర్వము కొంచెమైననులేనివాడవు. జానకీరామా!

కలహదుర్భిక్షాది కారణంబులచేత
బాధలు వడకుండఁ బ్రజలఁబ్రోచి
హయమేధ రాజసూయాదికాలములందు
క్షితిదేవతలకు దక్షిణలొసంగి
పరమతపోవిఘ్నకరులవధించి బా
ములు వొందకుండ సన్మునులనోమి
పరిపంథులగు నిశాచరులచే బాధింపఁ
బడిన బర్హిర్ముఖపాళిఁ గాచి
యవనిపతులొనరించు పుణ్యంబువలన
నవతరించితివీవు సూర్యాన్వయమున
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 13

**తాత్పర్యము :** జానకీరామా! సర్వబ్రహ్మాండములకు సార్వభౌముడా! భద్రగిరిని నివాసస్థానముగా పొందిన రామభద్రా! దయాసముద్రా! పోరాటాలు కరవు కాటకములు మొదలైనవానిచేత బాధలు పడకుండ ప్రజలను రక్షించి, అశ్వమేధ రాజసూయాదులు చేయు సమయములందు బ్రాహ్మణులకు అధికమైన సంభావనలిచ్చి, వారి తపస్సులకు ఆటంకము కలిగించువారిని చంపి, బాధలు పడకుండ సన్మునులను రక్షించి, శత్రువులగు రాక్షసులచే బాధింపబడిన దేవతలను రక్షించి,రాజులు చేసికొన్న పుణ్యఫలముగా నీవు సూర్యవంశమునందవత రించితివి.

పురుషవర్యులులేరె? భువనమోహనుఁడైన
కౌసలేయుని సాటిగారుకాని
ఘనధనాఢ్యులులేరె? మన రాఘవునిరీతి
నర్థికల్పకులు కారైరిగాని
సుందరాంగులులేరె? చూడఁగా రామచం
ద్రాభసద్గుణులు మృగ్యంబుగాని
శౌర్యవంతులులేరె? జానకీపతిభంగి
శరణాగతావనులరుదుగాని

యనుచుఁ గోవిదజను లయోధ్యాపురమున
సన్నుతించెదరఁట నిన్ను సభలయందు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 14

**తాత్పర్యము :** జానకీరామా! బ్రహ్మాండసార్వభౌమా! భద్రగిరిని ఆవాసముగా చేసికొనిన రామభద్రా! కృపాసముద్రా! లోకములో ఎందరు పురుషశ్రేష్ఠులులేరు? ఉన్నారు. కాని కౌసల్యాత్మజునివంటి భువనమోహనాసౌందర్యముకలవారు లేరు. ధనముచేత ప్రసిద్ధులులేరా? ఉన్నారు. కాని రామునివలె యాచకులకు కల్పవృక్షమువంటివారులేరు. సుందరావయవములు కల్గినవారులేరా? ఉన్నారు. కాని రామునివంటి సద్గుణములుగలవారులేరు. శౌర్యవంతులులేరా? ఉన్నారు కాని సీతాపతియగు రామునివలె శరణనివచ్చినవారిని రక్షించువారు లేరు. అని పండితులైనవారు అయోధ్యాపురమున పండితసభలలో రామా! నిన్ను సన్నుతించుచున్నారు.

రసికాగ్రగణ్యుఁడై రమణీమణులు దన్నుఁ
బరిహసించిన మాఱువలుకఁడయ్యెఁ

బూర్ణవయస్కుఁడై పొలఁతులుడాయవ
చ్చినఁగానిఁ గూర్మి వీక్షింపఁడయ్యెఁ
బురుషసత్తముఁడయ్యు సరసిజాక్షులఁగాంచి
యనురాగమేమాత్ర మునుపఁడయ్యె
మితిలేని సౌందర్యయుతుఁడయ్యు నవలేప
మిసుమంతయైన వహింపఁడయ్యె
రాముఁడిటువంటి సత్పుణ్యరాశి యెవ్వఁ
డని వచించెదరఁట వధూజనులు నిన్ను
జానకీరామ! బ్రహ్మాండ సార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 15

**తాత్పర్యము :** జానకీరామా! బ్రహ్మాండ సార్వభౌమా! భద్రాద్రి నివాసస్థానముగా గల రామభద్రా! కృపాసముద్రా! రసికులలో అగ్రగణ్యుడైనను, అందమైన స్త్రీలు తనను పరిహాసములాడినను రాముడు మారుమాటాడడు. మంచి యౌవనదశలో నుండియు యౌవనవతులగు సుందరాంగులు సమీపమునకు వచ్చినను వారిని ప్రేమతో చూడడు. పురుషులలో శ్రేష్ఠుడైనను, పద్మములవంటి నేత్రములుగల సుందరాంగులను చూచివారియందేమాత్రమును అనురాగముంచడు. సాటిలేని దివ్యసౌందర్యము కలిగినవాడైనను రవ్వంతయైనను గర్వమును పూనడు. రాముడిటువంటి పుణ్యరాశి. వానికి. నీడెవ్వరని స్త్రీలు నిన్నుగూర్చి పలుకుచుందురు.

అన్యాంగనానురాగాభావమన్నను
శ్రీరామునందె వీక్షింపవలయు
దీనసంరక్షణాధీన నిశ్చయమన్నఁ
గౌసలేయునియందె కాంచవలయు

శాస్త్రోక్తనిర్మలాచారమన్నధరాసు
తాధీశ్వరుని సొంతమనఁగవలయు
భూతోపకారప్రభుత్వం బనఁగ రామ
దేవునిదనుచు వాదింపవలయు

ననివచింతురయోధ్యయం దవనిసురులు
తావకీ నాతివేల ప్రభావమెఱిఁగి
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 16

తాత్పర్యము : పరస్త్రీలయందు అనురాగములేనివాడను గుణము రామచంద్రుని యందే వీక్షింపవలయును. దీనులైనవారిని రక్షించుటకు, అధీనమైన నిశ్చయము కలవాడెవ్వడన్నచో కౌసలేయునే చూడవలయును. శాస్త్రోక్తప్రకారము జీవితమును ఆచారభరితముగా కొనసాగించువాడెవరన్నచో సీతారాముడే అని చెప్పవలెను. మానవులకేగాక, సర్వభూతములకు హితమొనరించు ప్రభుత్వ మెవ్వరిదన్న రామునిదేయని చెప్పవలయును. అని రామభద్రా! నీ అతివేల ప్రభావముతెలిసి అయోధ్యాపురబ్రాహ్మణులు ఇట్లు చెప్పుదురు. జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమా! భద్రగిరిరామభద్ర! కరుణాసముద్ర!

నిర్మలాశయముల నిఖిలేంద్రియంబుల
దానాతిశయముచే దీనజనుల
భూరిసపర్యచే సూరివర్యుల నేక
పత్నీవ్రతంబుచే భవ్యమతుల
వైరాగ్యబలముచే వామాజనుల సదా
చారంబుచేత ద్విజాతివరుల
మహితార్జవముచే సమస్తమానవులను
విపుల సత్యంబుచే విష్టపముల

గెలిచెరాముఁడనుచుఁ గోవిదులు వచించి
రెలమి సాకేతపురి నీవు నిలుచునాడు
జానకీరామ! బ్రహ్మాండ సార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 17

**తాత్పర్యము :** జానకీరామా! బ్రహ్మాండసార్వభౌమా! భద్రగిరిరామభద్రా! కృపాసముద్ర! నిర్మలాశయములతో ఇంద్రియాలను, అతిశయదానముచే దీనులను - అధిక సపర్యలతో పండితశ్రేష్ఠులను, ఏకపత్నీవ్రతముతో బుద్ధిమంతులను, వైరాగ్యముచే స్త్రీలను, సదాచారముతో బ్రాహ్మణులను, ఉత్తమార్జవముచే సమస్తమానవులను, సత్యముతో లోకాలను రాముడు జయించెనని నీవు సాకేతపురమున నివసించునాడు పండితులు వచించిరి.

శౌర్యంబుచే బహిశ్శత్రుసంఘంబుల
ధైర్యంబుచేత స్వాంతస్థరిపుల
సాంత్వనాలాపపోషణములచేత ము
న్నాటయేబది జనముల నపార
వాత్సల్యమున భృత్యవరుల దాసీజనం
బులవనీపకులఁ బ్రభూతదాన
గుణముల సౌశీల్యగుణముచేఁ బౌరజ
నావళి గెల్చితివంద్రు నిన్ను
దాశరథివైననాడయోధ్యాపురమున
సూరివరులట్టు లసమొంద నేరితరము
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 18

**తాత్పర్యము :** జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ! భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! సాటిలేని శౌర్యపరాక్రమములచే బహిశ్శత్రువులను, ధైర్యముతో

మనస్సులోని కామక్రోధలోభాది అంతశ్శత్రువులను బుజ్జగింపుమాటలతో పోషణతో నూట ఏబదిమంది తల్లులను (దశరథుని భార్యలను) వాత్సల్యముతో సేవకులను, దాసదాసీలను, అధికదానములతో యాచకులను, సౌశీల్యముతో పౌరజనులను నీవు జయించితివని అయోధ్యాపురమున సూరిజనులనుచుందురు. ఇంతకీర్తి నొందనెవ్వరితరము? నిజమునకు నీవు విష్ణుడవు. దశరథపుత్రుడవై నప్పుడు ఇట్టి కీర్తినందితివి.

రాముని రాజ్యభారమునందు నియమింప
వచ్చునా? యనుచు నివపత్తమాటఁ
బల్కిపల్కకమున్నఁ బౌరజనంబులు
దశరథాధీశు వదనముఁగాంచి
మితిలేని సంతోషయుతులై ధరాధిప
త్యంబీగదయ్య! సీతాధిపునకు
నిమ్మను నీదుగుణమ్ములెన్నఁగ సభా
భవనంబు మార్మోసెఁబడసెమోద

మాజి సమకాలికుల కట్టు లఁబ్రమైన
నీ గుణములాధునికులు వర్ణింపరాదె?
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 19

**తాత్పర్యము** : జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమా! భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! రామునిరాజ్యపదవిలో నియమింపుమందురా?యని తండ్రియగు దశరథుడు పలికి పలుకకముందే పౌరజనులందఱును ఆయన మొగమువంక చూచి, అమితమైన సంతోషముతో త్వరగా రామునకు రాజ్యాధిపత్యమీయవయ్యా! అని నీ గుణములను సభాసదులు ప్రశంసించుచుండగా ఆ భవనమంతయు మారుమ్రోగినది. అజమహారాజు పుత్రుడగు దశరథుడు, ఆయన సమకాలీనులు వర్ణించిన నీ గుణములాధునికులు వర్ణింపగలరా?

మా రామచంద్రునకీరాజ్యపట్టాభి
షేకమెన్నఁడు నీవు చేయుదనుచు?
సింహాసనమున వేంచేసిన జానకీ
కాంతునెన్నడు నిరీక్షింతుమనుచు?
భరతాగ్రజుండు తీర్పరియైపలుకుమాట
లింపుగానెన్న డాలింతుమనుచు?
సామంతరాజులతో మన రాముఁ డె
న్నడుగూడి చిన్ని పూల్వడయుననుచుఁ?

దలఁచు మామాతలఁపుల సత్ఫలముఁగాంచు
ననివచించిరి నీ జనకునకు జనులు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 20

**తాత్పర్యము :** జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ! భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! మా రామచంద్రునెప్పుడు రాజ్యపట్టాభిషిక్తుని చేయుదువు? సింహాసనముమీద అధివసించిన జానకీరాములనెప్పుడు చూచెదమో? భరతాగ్రజుడు సమస్యలను తీర్చుచు, భాషించునప్పుడు, ఎప్పుడు వీనులవిందుగా ఆ పలుకులు విందుమో? సామంతరాజుల వలన మన రాముడెప్పుడు సేవింపబడును? అని ఆలోచించు మా ఆలోచనలు ఎప్పుడు ఫలించును? అని ప్రజలు నీ తండ్రిని ప్రశ్నించిరి.

శిలనాతిఁజేసి భాసిలునీదు పదధూళిఁ
బోలునే సర్వతీర్థాళులైనఁ?
దాఁకికబంధుగంధర్వుఁజేసిన భవ
దసికెనయౌనె? దివ్యాస్త్రసమితి

గ్రద్దను రాజేంద్రుఁగావించు నీకర
స్పర్శాభమగునె? యా స్పర్శవేది
కీలాలములురాలు రాలుగావించునీ
బాణాగ్నితుల్యమే? బాడబాగ్ని
యేకపత్నీవ్రతుండవౌ నీకుసాటి
వచ్చునే యెవ్వడైన? దేవవ్రజంబు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 21

తాత్పర్యము : శిలగానున్న అహల్యను స్త్రీగాచేసిన నీ పాదధూళితో సమస్త తీర్థములైనను సమానమగునా? కబంధుడు రామలక్ష్మణులను బంధించి వారి కత్తులచే నరుకబడి, గంధర్వపతియయ్యెను. దివ్యాస్త్రము లెన్నియైనను నీ ఖడ్గముతో సమానమగునా? కరస్పర్శతో గ్రద్దను రాజేంద్రునిగాచేసిన నీ కరస్పర్శకు స్పర్శవేది సమానమగునా? సముద్రజలములన్నింటిని రాళ్ళుగా మార్చగలిగిన నీ బాణాగ్నికి బడబాగ్ని సమానమగునా? ఏకపత్నీవ్రతుడవైన నీతో దేవతలలో ఎవ్వడైనను నీకు సాటివచ్చునా? జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ! భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర!

గమనించుచోఁ బాదఘట్టనచే శిలా
కంటకంబులు ధూళిగానలంగ
జవనంబుతోరాయుసక్తికర్షణముచే
వినుదాఁకు వృక్షముల్ విరిగికూల
నతిశయదీర్ఘబాహాందోళనమ్ముచేఁ
బార్శ్వస్థమృగములు బడలిపాఱఁ
జెలఁగిచెచ్చెరఁ జేయు సింహనాదములచే
సామీప్యజంతుసంచయములీల్గ

దంబుమీఱంగవచ్చు తాటకనొకమ్మ
చేతఁగూల్చినశక్తి వచింపఁదరమె?
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 22

**తాత్పర్యము :** ఇందు తాటకవచ్చునపుడు జరిగిన విశేషములు వెల్లడింపబడు చున్నవి. తాటకయొక్క పాదఘట్టనములచే, రాళ్లుముళ్లు దుమ్ము దుమ్ముగా నలిగిపోవుచున్నవి. వేగముతో వచ్చుచుండ ఆమె తొడలు తాకి ఆకాశమువఱకు పెరిగిన చెట్లు విరిగిపోవుచుండగా. బాగా పొడవు బలమైన బాహువులు చాచుటచే ప్రక్కలనున్న అడవిమృగములు పరువులెత్తుచున్నవి. గట్టిగా ఆమె చేయుచున్న సింహనాదములకు సమీపమునందున్న క్రూరజంతువులు చచ్చుచున్నవి. అట్లు ఆటోపముగా వచ్చుచున్న తాటకను ఒక్కబాణముతో కూల్చిన నీ శక్తి ఇట్టిదని వర్ణింపసాధ్యమగునా?

పదివేలగౌరుల భారంబుగలమేను
కారాకు తీరై వికారమొందఁ
బర్వతంబులనైనఁ బగిలించు దోషాబ
లంబంతలో నిష్ఫలంబుగాఁగ
నెంతవారలను మోహింపంగఁజేయు మా
యాతిశయంబు వమ్మైతొలంగ
నూఱుయోజనములు పాఱెడు వఱకునూ
ల్కొనలేక జలధిలోఁగూలిమునిఁగి
తేలెమారీచుఁడతని నా లీలఁగూల్చి
నట్టి నీ బాణవేగమెంతని నుతింతు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 23

**తాత్పర్యము :** జానకీరామా! బ్రహ్మాండసార్వభౌమా! భద్రాద్రి నివాసస్థానముగా గలవాడా! దయకు సముద్రుడా? పదివేల ఏనుగుల బరువు కలిగిన శరీరము, చిరిగిన ఆకువోలె వికారమును పొందగా, పర్వతాలనైనను బ్రద్దలు చేయగల రాక్షసబలము నిష్ప్రయోజనమగునట్లు, ఎంతవారినైనను తన మాయాజాలముచేత మోహింపచేయగల రాక్షసమాయ వ్యర్థముకాగా, బాణఘాతముతో నూరామడల దూరము కొట్టుకొనిపోవుచు, నిలువద్రొక్కుకొనగల శక్తినశింపగా, సముద్రము నందు కూలి మునిగితేలి మారీచుడు వేదనపడెను. రామా! అంతటి శక్తి కలిగిన నీ బాణమాహాత్త్వమునేమని నుతింపగలను?

**గజకోలశార్దూల కాసరగోమాయు**
**సింహాన్వయములు నశింపమెక్కి**
**గ్రస్తనుబోలు నుత్కృష్టమునీంద్రుల**
**ఆశ్రమంబులకు భయంబొసంగి**
**యాకాశమందు విహారంబుసల్పు దై**
**వతపుంగవులకుఁ గల్వరముఁగూర్చి**
**సర్వదివ్యాస్త్రశస్త్రముల కవధ్యుఁడై**
**కొండ చందాన డీకొనువిరాధుఁ**

**గవిసి చంపిన నీ పరాక్రమము మామ**
**కారులవధించుఁగాక మహానుభావ!**
**జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!**
**భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర!** **24**

**తాత్పర్యము :** జానకీరామా! సర్వ బ్రహ్మాండములకు సార్వభౌముడవైనవాడా? భద్రాద్రిక్షేత్రమే ఆవాసముగాగల రామభద్రా! దయకుసముద్రమువంటివాడా! ఏనుగులు, పందులు, పులులు, అడవిదున్నలు, నక్కలు, సింహములు, సివంగులు మొదలైన అడవి జంతువులను చంపి వాని మాంసమును కడుపునిండుగా

మెక్కి, బ్రహ్మదేవుని మహత్తువంటి మహత్తుకలిగిన మహర్షుల ఆశ్రమముల కన్నిటికి భీతిని కలిగించి, ఆకాశమునందు విమానములలో సంచరించుచున్న, సురఖచరగంధర్వ సిద్ధసాధ్యాది దేవతాయోనులందరును కలవరపాటును పొందుచుండగా, బ్రహ్మాస్త్రాది సమస్త దివ్యాస్త్రములకును, అవధ్యుడై పెద్దకొండవంటి శరీరముకలవాడై, ఎవరినైనను డీకొని జయింపగల విరాధుడను రాక్షసుని వధించిన నీ మహాపరాక్రమముతో మాయొక్క అంతఃశత్రువులను, బహిశ్శత్రువులను ఓ మహానుభావా! అంతము చేయవలసినది.

యమ నియమాది యోగము లజస్రము నభ్య
సించి నిశ్చలుఁడనై సిద్ధిఁజెంది
పవమానపానీయ పర్ణభక్షణముల
చే శరీరంబుఁ గృశింపఁజేసి
వాఙ్నియమంబుచే వర్తించి మన్మనో
వీధిలో బలుమాఱు వెదకివెదకి
కానజాలక సదా ధ్యాననిష్ఠుండనై
ఈ వేళఁగంటి నిన్నీస్థలమున
ననినుతించె సుతీక్ష్ణసంయమి భవత్ప
రత్వమారసి యధికవైరాగ్యమంది
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 25

**తాత్పర్యము :** జానకీపతివైన ఓ రామభద్రుడా! బ్రహ్మాండములకు చక్రవర్తివైనవాడా! భద్రగిరిని నివాసస్థానముగా చేకొనిన రామభద్రా! కృపకుసముద్రునివంటివాడా! నీవరణ్యవాసమున కేగినపుడు సుతీక్ష్ణముని ఆశ్రమంబునకు పోయితివి. అప్పుడాతడు, రామా! "యమము-నియమము మొదలైన యోగాలను ఎల్లప్పుడును అభ్యసించి, నిశ్చలయోగసిద్ధిని పొంది, వాయువు – నీరు –

ఆకులు మాత్రమే ఆహారముగా స్వీకరించి శరీరమును కృశించునట్లుచేసి, వాక్కులను నియమించి, నియమముతో ప్రవర్తించి నా మనస్సులో ఎన్నో పర్యాయములు నీ కొఱకు వెదకివెదకి, చూడలేక, ఎల్లప్పుడు సమాధినిష్ఠలో ఉండి, ఈనాటికి నిన్ను ఇక్కడ ఈవిధముగా చూడగల్గితిని. అని సుతీక్ష్ణసంయమీశ్వరుడు మిమ్ము పొగిడెను. అందులకు కారణము నీవే పరాత్పరుడవని తెలిసికొనుటయే. అందువల్ల కలిగిన వైరాగ్యముతో నిన్ను దర్శింపగలిగినాడు.

ధనదహ్రదమున సంతతముద్భవించుచుఁ
గొమరారు సౌగంధికములరీతి
మానససరసి సమాన జన్మముఁగాంచి
పొలుచు జాంబూనదాంబుజములట్లు
రోహణాచలమందు రుచిమీఱఁ బొడమి తీ
పారు నానారత్న వారముగతి
నూతనారామసంభూతంబులై వసం
తమునఁదోఁచెడులతాంతముల పగిది

వెలయు మౌనులుదండకావిపినమందు
భక్తితో నినుఁగనిరి కల్పకముభంగి
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్రా! 26

తాత్పర్యము : జానకీపతివైన ఓ రామచంద్రా! బ్రహ్మాండములకన్నింటికి చక్రవర్తివైనవాడా? భద్రపర్వతము నిల్లుగాచేసికొని నివసించునో రామభద్రా! దయాసముద్రా! కుబేరుని ఉద్యానవనమందలి సరోవరములో జనించి, అందముచే అతిశయించు సౌగంధిక పుష్పములవలె, మానససరోవరమునందంద మతిశయించినట్లుగా జనించు బంగారు తామరపూవులమాదిరిగా, రోహణ

పర్వతముమీద జనించి మిక్కిలి కాంతిచే ప్రకాశించు నానారత్నసమూహములీల, క్రొత్త ఉద్యానవనమునందు, వసంతఋతువులో జనించిన అనేక పుష్పములరీతి ప్రకాశించు మహర్షులు అరణ్యమందు, భక్తితో నిన్ను కల్పవృక్షమునువలె దర్శించిరి.

చిత్రకూటమునందు సీతాశయానంద
మునకునై యొక దర్భమెనసి నీవు
సంధింపనది యజాస్త్రంబై సెగల్పొగ
లెగయ వెంబడివద్దవగపుఁజెంది
కాకాసురుఁడు దిక్కుఁగానక నిఖిల లో
కములఁ జరించి విభ్రమముఁగాంచి
భవదంఘ్రియుగళంబుఁ బ్రాపించి మ్రొక్కె ద
దేకాక్షిదృష్టి మహితశరమున
కిచ్చి రక్షించినట్టి త్వదీయ చాప
నైపుణంబెన్న సాధ్యమే నలువకైన
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 27

**తాత్పర్యము** : జానకీదేవీ భర్తవైన రామచంద్రా! సమస్త బ్రహ్మాండములకు చక్రవర్తివైనవాడా! భద్రగిరి స్థానముగాగల రామభద్రా! కృపాసముద్రా! నీ చాప నైపుణ్యమింతయని వర్ణించుటకు బ్రహ్మకైన సాధ్యమగునా? చిత్రకూట పర్వతమునందు, సీతాదేవియొక్క ఆనందమతిశయించుట కొఱకు, ఒక దర్భను కాకాసురునిపై వేసితివి. అది బ్రహ్మాస్త్రముగా మారి భగ్గునమండుచు, ఆతని వెంబడించినది. వాడు భయపడి రక్షించువారులేక, స్వర్గకైలాస సత్యాది లోకములన్నింటికిపోయి, ఇంద్ర, శంకర, పద్మోద్భవులచే రక్షణపొందలేక, నీ పాదపద్మములమీదపడి నమస్కరించెను! నీ ధనుస్సునకు తన ఒక కంటిచూపు నొసంగి నీ ధనుస్సు వలన రక్షింపబడెను.

రాముడరణ్యావాసముననుండెను. చిత్రకూటమున నుండగా నొక్క నాటిమధ్యాహ్నము రాముడు సీతా ఉత్సంగమునందు పవ్వళించెను. దేవేంద్రుని కుమారుడగు జయంతుడు సీతాసౌందర్యానురక్తుడై కాకిరూపమునవచ్చి ఆమె స్తనమును పొడిచెను. రాముడు నిద్రలేచి గడ్డిపరకను బ్రహ్మాస్త్రమంత్రముతో అనుసంధించి అతనిపై వదలెను.

సురులువేష్టింప భాసురవిమానముఁదెచ్చి
రమ్మనుశక్రు నిరాకరించి
స్వవశీకృతములైన సరసీరుహ భవాది
లోకములెల్లఁ దృణీకరించి
బాల్యప్రభృతిసేయుభవ్య తపంబు సొం
పారుపల్కుల నీకు ధారపోసి
తన పుణ్యమీరీతిఁ దనువొంది విచ్చేసె
ననుచు నీయందాశయంబు నిలిపి

దేహసంబంధమీది సందేహముడిగి
పరమపదమందెఁ బోశరభంగమౌని
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 28

**తాత్పర్యము :** జానకీపతీ! వేధోండ సార్వభౌమా! భద్రాద్రినిలయా! కృపాసాగరా! నీవు సీతాలక్ష్మణసమేతుడవై అరణ్యావాసమునకేగితివి. పుణ్యమున్యాశ్రమ సందర్శనము కొఱకు శరభంగమహర్షి ఆశ్రమమునకు పోయితివి. అప్పుడే బ్రహ్మదేవుని అజ్ఞతో దేవేంద్రుడు, దేవతలు పరివేష్టించి సేవించుచుండగా, దివ్యవిమానమును తీసికొనివచ్చి శరభంగుని స్వర్గమునకు రమ్మనెను. అతడా ఆహ్వానమును తిరస్కరించెను. తన తపశ్శక్తితో పొందదగిన బ్రహ్మలోకమును, కైలాసమును అతడు తృణీకరించెను. తాను బాల్యము

నుండియు చేయుచున్న తపస్తుతులు నీకు ధారపోసి, తన తపఃపుణ్యమే యిట్లు రామరూపమున తనయొద్దకు వచ్చినదని, నీయందే తన భారముంచెను. దేహసంబంధమును వదలి, సందేహము లేకుండ రామా! నీ సన్నిధిని శరీరమును యోగాగ్నిచే త్యజించి, పరమపదమును పొందెను.

**చిరకాలమును మహత్తరరుజాభరముచే**
**రోదించువారలారోగ్యమొంది**
**ప్రబలాతపముచేఁ బిపాసగల్గినవాఁడు**
**జాహ్నవీ మాధుర్యజలముఁ గ్రోలి**
**దుర్దశాపీడచేఁ దూలినవాఁడింటి**
**నడుమ నూతన నిధానంబుఁగాంచి**
**సంసారదుఃఖాగ్ని సంతప్తులగువారు**
**తమకించి పృథువిరాగము వహించి**

**సౌఖ్యమొందిన గతిమునిజనులు నిన్నుఁ**
**గాంచి ముదమంది రెదదండకావనమున**
**జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!**
**భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర!** 29

**తాత్పర్యము :** జానకీరామా! బ్రహ్మాండసార్వభౌమా! భద్రగిరిరామభద్ర! కృపాసముద్రా! రామా! దండకారణ్యమున మునిజనులందఱు నిన్నుచూచి, ఎంతోకాలము భయంకరవ్యాధిచే బాధపడినవారు ఆరోగ్యమును చెందినట్లును బిట్టుటెండచే దప్పికచెంది బాధింపబడువారు, గంగాజలమును పానము చేసినట్లుగా, పేదరికముచే బాధను పొందువారు, ఇంటిమధ్యమున పెన్నిధానమును కనుగొనినట్లు సంసారదుఃఖాగ్నిచే కాలిపోవుచున్నవారికి వైరాగ్యభావముకల్గి సుఖించినటుల సంతోషమును పొందిరి.

పంచాగ్ని మధ్యమందుంచి దేహమునుఁ బీ
డించి తపంబుఁగావించువారు
పర్ణసమీరణ పానీయములు మాత్ర
మాహారముగఁగొనునట్టివారు
మేనిపై భూరివల్మీకంబు మొలిచినఁ
బొలివోకధ్యానంబు సలుపువారుఁ
బక్షులు జేదల లోపలఁగూండ్లు గట్టి పి
ల్లలఁజేయు టెఱుఁగక నిలుచువారు

వచ్చి నినుగాంచి వేదాంతవాక్యముల ను
తించి మితిలేని మోదంబుఁ గాంచిరిగద!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 30

**తాత్పర్యము :** జానకీరామా! బ్రహ్మాండసార్వభౌమా! భద్రాద్రివాసా! కృపాసముద్రా! పంచాగ్ని మధ్యమందు శరీరమునుంచి, తపస్సుచే శరీరములను పీడించు కొనువారు, ఆకులు, గాలి, నీరు, మాత్రమాహారముగా తీసికొనువారు, దేహము మీదపుట్టలుపట్టినను, సమాధిస్థితిలో నుండి ధ్యానము చేయువారును, తమ జడలలో పక్షులు గూళ్లుకట్టి పిల్లలను చేయుచుండ నా విషయము తెలియక నిలుచువారును, నీ దగ్గరకువచ్చి వేదాంతవాక్యములతో నిన్ను నుతించి ఎనలేని ఆనందము నందుదురుగదా!

ధాత్రిప్రశస్తమౌ చిత్రకూటమునందు
భవ్యమందాకినీ ప్రాంతమందుఁ
బంపాసరోవరోపాంతంబునందుఁ బా
వనమైన దండకావనమునందు

ఘనజటాయువు వసించిన కాననమునందు
భూరిగోదావరీ తీరమందు
విటపిసంయుత పంచవటియందు మంజులో
ద్యానాభమగు జనస్థానమందుఁ
దమ్ము బాధించు దైత్యవధంబుఁ గోరి
సన్నుతించిరిగాదె మస్కరులు నిన్ను
జానకీరామ! బ్రహ్మాండ సార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 31

తాత్పర్యము : లోకమున ప్రసిద్ధిని వహించిన చిత్రకూటపర్వతమునందును, మందాకినీ నదీతీరమునందును, పంపాసరోవరప్రాంత ప్రదేశమునందును, పవిత్రమైన దండకారణ్యమునందును, జటాయువు నివసించిన అటవీప్రాంతము నందును, గోదావరీ తీరమందునను, ఐదుమట్టిచెట్లుగల పంచవటియందును ఉద్యానవనసమాన సుందరజనస్థానమునందును, నీవు అరణ్యావాసమువేళ నివసించితివి. జానకీరామా! బ్రహ్మాండసార్వభౌమా! భద్రాద్రిధామా! కృపాపయోధీ! ఆయాస్థలములలో తమను బాధించు రాక్షసులనందరిని వధింపుమని, అచ్చట తపస్సుచేసికొను తాపసులు నిన్ను కోరిరికదా!

కోటి మన్మథులకు దీటై వెలుఁగు తావ
కామేయసౌందర్యమట్టెచూచి
నీహారకిరణాగ్ని నీరజాప్తునకు న
తీతమైతగుతనూదీప్తిఁగాంచి
తమ హృదబ్జములందుఁ దపముచేఁ గనుపర
మాకార మీరూపమని యెఱింగి
వరపరివ్రాజకుల్ పరిరంభమొనరింపఁ
జుంబునంబులొనర్పఁ జూడవాని

క్రీయకొనవైతి వీవు స్వకీయసుంద
రాంగవైభవమెన్నంగ నలవియగునె?
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 32

**తాత్పర్యము :** కోటి మన్మథుల సౌందర్యమునకు సమానమై ప్రకాశించు, అమేయమైన నీ సౌందర్యమును చూచి, చంద్రుడు, అగ్ని సూర్యునికాంతి కతీతమైన శారీరకకాంతిని పొంది, తాము మనోబ్జములందు, తపస్సుచే దర్శించుచున్న చిన్మయాకారమిదియేయ్యని నీ రూపమును తెలుసుకొనగా, సర్వసంగపరిత్యాగులైన మునులు నీ సౌందర్యమోహితులై నిన్ను కౌగిలించుకొని ముద్దాడ చూడగా నీవంగీకరింపవైతివి. భద్రాద్రిరామా! అంతటి నీ సౌందర్యము ఇంతటిదని వర్ణించుట కలవియగునా? కాదని భావము.

దేహాభిమానంబుదిగ్గన వర్జించి
లోకాభిమానంబుఁగాకుఁజేసి
మహితేంద్ర భోగాభిమానంబుమాని భా
షానాథ లోకాభిమానమేది
వైరాగ్యమందిన పారికాంక్షులు తావ
కీన సురూపంబుగానిపింప
గానె సౌఖ్యముఁ జెందఁబూనిరిగద, లాఁతి
వారెట్టులైరో సరోరుహాక్ష
లెంత దుఃఖించిరో స్మరాక్రాంతహృదయు
లగుచు నిను దలఁపోసి దేవాదిదేవ!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 33

**తాత్పర్యము :** ఓ జానకీరామా! భద్రాద్రిరామా! దేహాభిమానములు వర్జించి, లోకాభిమానమును విసర్జించి, ఇంద్రభోగసంబంధమగు స్వర్గలోకావాస భోగములను పరిత్యజించి, సరస్వతీవిభుండగు బ్రహ్మయొక్క తపోలోకాభిమానమును, విడిచిపెట్టి కేవల వైరాగ్యస్వరూపులైన మహర్షులు, నీ దివ్యమంగళ విగ్రహసౌందర్యమును చూడగనే, నిన్ను కౌగిలించుకొని, ఆలింగన సౌఖ్యమును పొందతలపోసిరికదా! వారి పరిస్థితియే అట్లున్నచో, బ్రహ్మాండసార్వభౌమా! రామా! వికసించిన తామరలవంటి నేత్రములగల సుందరాంగులు నీ సౌందర్యమును చూచి, మన్మథావేశమునుచే ఆక్రమింపబడి నిన్ను తలచుకొని యెంత వేదన చెందినారోకదా!

కమనీయ దివ్యమంగళ విగ్రహావాప్తి
కలిగించి కన్నులకఱవుఁదీర్చి
ద్రాక్షారసాలసితామిశ్రదుగ్ధా భ
హారివాక్యములచే నాదరించి
హిమవారి సన్నిభాహీన కటాక్షామృ
తముచే శరీర సంతాపమడఁచి
లలితోరుబూక తైలప్రాయమగు జిడ్డు
గలుగు సౌహార్దమిమ్ములనొనర్ప
నభయ మొసఁగి పరివ్రాజకాశయముల
దిగులువాపిన నీ దయాధిక్యమెంతు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 34

**తాత్పర్యము :** మహాసుందరమగు నీ దివ్యమంగళవిగ్రహ దర్శనముచేత మునీశ్వరులకన్నుల కఱవునుతీర్చి, ద్రాక్షరసము, పంచదారలతో కలిసిన పాలధారలవంటి వాక్యములతో వారినాదరించి, మంచునీటి ప్రవాహమువంటి

చల్లని కడకంటి చూపులతో వారి శారీరకతాపమును పోగొట్టి అమ్మదప్పు బిడ్డవంటి సౌహార్దముతో వారికభయమిచ్చి, మహర్షుల ఆశయములు నెరవేరునట్లుగా వారి దిగులుపోగొట్టిన జానకీరామభద్రా! నీ అధికమైన కరుణ ఎంతటిదని వర్ణింపగలము?

విరివిఁగల్గిన మంచివిస్తరాకులొసంగి
పరిమళమిళిత పుష్పములొసంగి
గమనించు తతిఁబాదుకలుగా, శయించుకా
లమున సెజ్జఁ బ్రవాళములుదులిపి
లలిహవ్యకవ్యంబులకు హోమకార్యావ
సరమందు వలసిన సమిధలిచ్చి
మకరందమును మహామాధుర్యరసయుక్త
ఫలములెల్లను సమర్పణమొనర్చి
భక్తిమీరంగ నీకు సపర్యచేసెఁ
దరువులని చెప్పుదురు సూరివరులుమున్ను
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 35

తాత్పర్యము : భద్రాద్రిరామా! నిన్ను పరమాత్మగా గుర్తించి, నీవరణ్యావాసమున కేగినపుడు, ఆయడవియందున్న వృక్షములు పొడవువెడల్పుగల విస్తరాకులిచ్చినవి. మంచిసువాసగల పూవులనొసంగినవి. నీ పాదాలకు పాదుకలనిచ్చినవి. పండుకొనువేళకు చిగురుటాకుల సెజ్జలనేర్పాటు చేసినవి. హోమములు చేయు వేళ హవ్యకవ్యములకు సమిధల నేర్పాటుచేసినవి. కమ్మని తేనియలు తీయని ఫలములు సమర్పించినవి. ఆవిధముగా వృక్షములు సపర్యచేసివని రామభద్రా! పూర్వమహర్షులు తెలియజేసిరి.

స్నానపానాంగసంస్కారంబులకు నిర్మ
లాంబువులిచ్చి జలాశయములు
శీతవాతాతపస్ఫీతవృష్టికి నార్తిఁ
గనకుండ ధరణీధ్ర గహ్వరములు
గాఢాంధకార సంకలితమౌతావుల
నయనంబు సూపి మహామృగములు
పయనించుతఱి నాతపము సోఁకకుండ, ను
పరి పక్షములు విప్పి పక్షితతులు

నిన్నుఁ బూజించె నడవిలోనున్నవేళ
ననివచింతురు కోవిద జనములెపుడు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 36

**తాత్పర్యము :** జానకీరామా! నీవు అడవిలోనున్న సమయమున, స్నానమునకు, పానమునకు, అవయవశుద్ధి కొఱకు సరోవరములు నీకు జలమిచ్చినవి. చలిగాలికి, భయంకరమైన ఎండలకు, అతివృష్టికి బాధపడకుండ పర్వతగుహలు నిన్ను సేవించినవి. గాడాంధకారముతోకూడిన ప్రదేశములయందు, తమ కన్నులను చూపి మృగములు సేవించినవి. చీకటిలో అడవిమృగముల నేత్రములు కాంతులతో కన్పించును. నీవు ప్రయాణమైపోవు సమయములయందు, పక్షులు నీపైని రెక్కలు విప్పి చరించుచు, ఎండతగులకుండ చేసినవి. ఈవిధముగా వృక్షములు పర్వతములు జంతువులు పక్షులు నిన్ను సేవించినవని పండితులు చెప్పుచున్నారు.

ప్రణవాక్షరము పరబ్రహ్మ జీవాచిదా
ఖ్యలఁజెప్పునని శ్రుతులనిశమెన్నుఁ

గాన శ్రీరాముఁ'దకార'వాచ్యుఁ'దుకార'
వాచ్యసీత మకారవాచ్యుఁదాసు
మిత్రాత్మజుండని మెచ్చి సీతాలక్ష్మ
ణాన్వితుండవగు నిన్నధికభక్తిఁ
బూజించి దినదినంబును విందులొనరించి
తమ తపస్సులనెల్ల ధారవోసి

చెందిరపవర్గమును మునిశ్రేష్ఠులెల్లఁ
గొఱతలుండునె? నినుఁగొల్చు గుణనిధులకు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 37

**తాత్పర్యము :** ఓ జానకీరామభద్రా! ప్రణవాక్షరమగు 'ఓం'కారము పరబ్రహ్మ జీవాత్మకమని వేదములు చెప్పుచున్నవి. అందు శ్రీరాముడు అకారస్వరూపుడు. (అకారోవిష్ణుః అని శాస్త్రము). సీతాదేవి 'ఉ'కార స్వరూప. సుమిత్రాత్మజుడైన లక్ష్మణుడు 'మ'కార స్వరూపము. అకార ఉకార మకారములతో కలిసి 'ఓం' అగును. ఆ విషయమును తెలిసికొని తపస్వి జనులందఱును సీతాలక్ష్మణ సమన్వితుడవైన నిన్ను మిక్కిలిభక్తితో, ప్రతిదినమును విందులొసంగుచు పూజించిరి. వారు తమ తపస్సులన్నియు ధారపోసి మోక్షమును చేరిరి. నిన్ను సేవించు గుణనిధులకు లోపములుండునా? ఉండవు.

సీతారామలక్ష్మణులరణ్యమున పోవుచుండగా వారు వాల్మీకిమహర్షికి ఓంకారస్వరూపముగా సాక్షాత్కరించిరి. అందులకు స్పందించి వాల్మీకి

"అగ్రతః ప్రయయౌరామః – సీతామధ్యేసుమధ్యమా!
పృష్ఠతస్తుధనుర్ధారిః లక్ష్మణోనుజగామః" అని

ఆహా అని ఆనందించెను. ఆ శ్లోకము ప్రేరేపించి, బ్రహ్మర్షి వేంకట దాసస్వామివారిచే ఈ పద్యమును పలికించియుండును.

విపులాధ్వరములకు వేఱువిత్తైజంతు
హింసాక్రియలలో ప్రశంసలంది
వేలవర్షములు జీవించియుఁ బుణ్యకా
ర్యములన్న సతతంబుహానిఁగూర్చి
మాంసకీకస రక్తమస్తిష్కధమనీముఖా
హారములచేత స్వకాంగమోని
మానవాళికి వైమానికులకు మౌని
సత్తములకు సాధ్వసంబుఁ గొలిపి
పాపవర్ధినియైన శూర్పణఖ నీ స
మక్షమునఁజేరి దుర్వృత్తి మానెనౌర!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 38

**తాత్పర్యము :** ఓ జానకీరామా! ప్రసిద్ధమైన యజ్ఞములను పాడుచేయుటకు వేరు విత్తైనది, జంతుసంతతులను హింసించుటయందు ఖ్యాతికెక్కినది, వేలకొలది సంవత్సరములు జీవించినది, పుణ్యకార్యములనన్నింటిని నాశమొనరించునట్టిది. మాంసము, కీకసము, రక్తము, ధమనులు మొదలైన ఆహారములతో తన శరీరమును రక్షించుకొనుచు, మానవులకు, దేవతలకు, మౌనిశ్రేష్ఠులకు భీతిని కల్పించుచు, పాపకార్యాసక్తయగు శూర్పణఖయను రక్కసి, నీ చెంతకుచేరి, దుర్వృత్తిని మానివేసినది.

పద్మరాగసమాన పదతలంబులనెన్ని
సక్థిసుందరతావిషయముఁదలఁచి
తమివిశంకట భుజాంతరమంజులతఁగాంచి
కమనీయతరదోర్యుగము గణించి

లలితలలాట ఫలకశోభఁ దర్కించి
సరసీరుహాభలోచనములెన్ని
కడునిద్దముగ నొప్పుగండముల్పరికించి
కార్ముకాభభ్రూయుగళముఁజూచి
బాళినినుఁ గోరెఁ గాదెశూర్పణఖమును మ
దనశిలీముఖ హతయై వ్యసనమునంది
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 39

**తాత్పర్యము :** పద్మరాగములకాంతినిబోలు ఎఱ్ఱనగు కాంతిగలిగిన నీ పాదతలములను చూచి, అందమైన యూరువుల తీరుగాంచి, విశాలమైన వక్షస్థలముయొక్క మంజులత్వమును విలోకించి, మిక్కిలి సుందరములగు రెండు చేతులను గమనించి, లలితమైన విశాలమగు నుదురుయొక్క అందమును తర్కించి, వికసించిన పద్మములనుబోలు నేత్రముల జంటను తలంచి, నున్ననై ప్రకాశించు చెక్కిళ్ళను కనుగొని, చాపమువలెనున్న కనుబొమలరీతినిమెచ్చి శూర్పణఖ మన్మధబాణఘాతవేదన భరింపలేక నిన్ను కామించినదికదా!

సౌమిత్రికనలి నాసాశ్రుతిచ్ఛేదన
మాచరించిన వైరమవలఁద్రోచి
ఖరదూషణాది రాక్షసకోటినాజిలోఁ
గినిసి వధించిన కీడుమఱచి
పంక్తికంఠుని కుటుంబముతో వినాశం బొ
నర్చిన వార్తనవాదరించి
తన రాక్షసీత్వమ్ము త్వద్దైవతత్వాలఁ
గలతార తమ్యంబుఁదలఁచుకొనక

శూర్పణఖ మోహమంది కృష్ణుఁడగు నిన్ను
దాసి భోగించె నఁట కంసదాసియగుచు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 40

**తాత్పర్యము :** శ్రీరామభద్రా! లక్ష్మణుడు కోపముతో తన ముక్కుచెవులను కోసివైచిన విరోధమును మఱచి, ఖరదూషణాది చతుర్దశ సహస్రరాక్షసులను క్రోధముతో నీవు జనస్థానములో సంహరించిన కీడును వదలిపెట్టి, రావణుని మంత్రికుమారబాంధవ పరివార సహితముగా యుద్ధరంగమునందు వధించిన వైరమును ఆదరింపక, తన రాక్షసత్వము, రాముని దైవత్వమును మధ్యగల బేధములు తలచుకొనక, శూర్పణఖ, కృష్ణావతారకాలమున కంసదాసియగు కుబ్జ (త్రివక్ర)గా పుట్టి, నీకు చందనాది లేపనసేవనొనర్చి నీతో సుఖించినదిగదా! అనగా అట్టి సుందరుడవని భావము.

అక్షీణకాలాయసాన్వితమై, రిపు
చ్ఛేదకంబైన కౌక్షేయకంబు
సారకర్కశదీర్ఘభారసంయుక్తమై
భాసిల్లు దివ్యశరాసనంబు
సర్వాస్త్రకరవాల సంచయాభేద్యమై
గాఢమోదం బిచ్చుకంటకంబు
సకల చరాచర జంతువులకు భయం
బొనఁగూర్చు సరసిజాసనశరంబుఁ

బ్రార్థనాపూర్వకముగఁగుంభజుఁడునీకు
నర్పణము సేయఁగైగొంటివడవియందు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 41

**తాత్పర్యము :** జానకీరామ! ఇనుముతో కూడినది శత్రువులను ఛేదింప సమర్థమైన ఖడ్గమును, పొడవైన కఠినమై బలముకలదియై బరువైనదియై ప్రకాశించు దివ్యచాపమును, అస్త్రములచే శస్త్రములచే, ఖడ్గములచే ఛేదింపబడక హర్షదాయకమై యొప్పు కవచమును, సమస్తమైన చరాచరములకు, జంతువులకు భయమును కల్గించు బ్రహ్మశరమును, అగస్త్యమహర్షి నీకు, అరణ్యమునందు ప్రార్థనాపూర్వకముగా సమర్పింపగా స్వీకరించితివికదా!

**చండేక్షుదండవరండముల్ ఖండించి**
**ధాత్రినిఁగూల్చు లవిత్రమట్లుఁ**
**జటచటార్భటులచే నటియించి కానన**
**చ్ఛటఁగాల్చు పవమానసఖునిరీతి**
**దారుణాసారప్రదంబులౌజీమూత**
**వారంబడంచు సమీరుభంగిఁ**
**దతదీర్ఘమేదినీధరభేదనము సమ**
**కూరుచుశాతశతారమనగ**
**దండకాటవిలోఁ జతుర్దశ సహస్ర**
**రాక్షసులఁగూల్చితివి గదా! రణమునందు**
**జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!**
**భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర!** **42**

**తాత్పర్యము :** ఓ జానకీరామా! భద్రపర్వతధామా! లావైన చెఱుకుగడల సమూహమును నరికి నేలమీదవేయు కత్తివలె, చటచ్ఛటమను ధ్వనులతో సంచరించుచు అరణ్యసమూహమును దహించు అగ్నిహోత్రునిరీతి, దారుణమైన శ్రేష్ఠమైన బలమైన మేఘసమూహములను చెల్లాచెదరుచేయు వాయువు భంగి, ఎత్తైన పొడవైన పర్వతములను బ్రద్దలుకొట్టగా సమకూడిన వజ్రాయుధమువలె, దండకారణ్యమున పదునాలుగువేలమంది రాక్షసులను, యుద్ధరంగమున సంహరించితివికదా!

ఝంఝామరుజ్జవ స్పర్శనంబునఁ బక్వ
తాళఫలములట్లు తలలుగూలె
బలితంపుమలనుండి యిలపైఁ దొరఁగునిర్ఝ
రముల చేందాన రక్తము స్రవించె
వడిసూత్రధారి కీలెడపఁగా భువిఁబడ్డ
బొమ్మలగతి శరీరమ్ములొరగెఁ
గాసరక్షోభిత కమలాకరంబునఁ
బలె వసామాంసపంకిలత తనరె

దండకావనమునఁ జతుర్దశసహస్ర
రాక్షసుల నీవుగూల్చిన రణమునందు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 43

**తాత్పర్యము :** జానకీరామ! కృపాసాగరా! దండకారణ్యమునందు నీవు పదునాల్గు వేలమంది రాక్షసులను చంపినయుద్ధరంగమునందు, ఝంఝామారుత స్పర్శచే పండిన తాటిపండ్లు నేలరాలిన విధమున రాక్షసుల తలలు నేలగూలినవి. ఎత్తైన పర్వతశిఖరముపైనుండి క్రిందకు ప్రవహించు సెలయేటి నీటిప్రవాహములవలె రక్తధారలు స్రవించినవి. బొమ్మలాటలాడించువాడు దారమును విడిచి పడవేయగా నేలమీదపడు తోలుబొమ్మలవలె శరీరములు పడినవి. అడవి దున్నపోతులచే అల్లకల్లోలము చేయబడిన పద్మాకరమువలె వసామాంసముల బురదయొప్పినది.

రాక్షసముక్త నారాచవారాభేద్య
మగు నురశ్ఛదము నేర్పమరఁదొడిగి
వర్షావసర వారి వాహవాహనచాప
సమభయంకర శరాసనముఁదాల్చి

శతకోటితుల్య తీక్ష్ణములైదిశాదశ
కమునందు మలయు మార్గణములేసి
రథరథ్యయోగ్యసారథులు లేకుండఁ బ్ర
త్యాలీఢ పాదస్థుఁడగుచు నిలిచి
సాహసంబున నసహాయ శౌర్యమూని
చేంపితివి దండకను నిశాచరబలంబు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 44

**తాత్పర్యము :** ఓ భద్రాద్రివాసా! రామభద్రా! నీవు, రాక్షసమూహముల బాణములకు పగలని కవచమును చక్కగా తొడుగుకొని, వర్షాకాలమందలి ఇంద్రచాపముతో సమానమగు భయంకరధనుస్సును ధరించి, వజ్రాయుధముతో సమానమగు వాడిగల బాణములను పదిదిక్కులయందును నింపించి, రథముగాని, గుఱ్ఱములుగాని, సారథిగానిలేకుండ ప్రత్యాలీఢపాదముతో నిలిచినవాడవై సాహసముతో, అసహాయశౌర్యముతో దండకావనియందు రాక్షస బలములను సులభముగా చేంపితివి.

పావకుండంటిమా? పావకశిఖల కీ
సాయకస్థితి దాహశక్తిలేదు
పవమానుఁడంటిమా? పవమానునకు నీవు
షత్కప్రయోగాతి జవములేదు
దినానాథుఁడంటిమా? దిననాథకిరణ సం
ఘాతంబునకు నింతకాంతిలేదు
సత్యంబనుచు మునీశ్వరులు వేల్పులు నుతి
సల్పఁగా విక్రమసాహసముల

దూషణునిఁ జంపినావు చతుర్దశామ
రారి వధయైన పిదప మహానుభావ!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 45

**తాత్పర్యము :** ఓ బ్రహ్మాండసార్వభౌమా! కృపానిధానా! రామభద్రా! అగ్నిహోత్రుని వంటివాడవందువా, అగ్నిశిఖలకు నీ బాణములందున్న దహనశక్తిలేదు. వాయుదేవుడవందుమా? వాయుదేవునకు నీ బాణములకున్నంత మహావేగశక్తి లేదు. సూర్యుడవందుమా? సూర్యకిరణముల సమూహమునకు, నీ కాంతివంటి కాంతిలేదు. ఇది సత్యమని దేవతలు, మునులు నుతించుచుండగా పదు నాలుగు వేల రాక్షసులను సంహరించిన పిదప దూషణాసురుని సంహరించినావు.

సాధ్వీజనోరోజ సమ్మర్దయోగ్యమౌ
వక్షంబు వజ్రకవాటమయ్యె
దానాశ్రితాభయదానప్రదంబులౌ
బాహువుల్ పన్నగాభంబులయ్యెఁ
బూబోండ్ల చుంబనంబుల కర్హమగు మోము
తుదిరేయి రేకంటు తోడనెసఁగె
లలిత శ్రవణ కపోలభ్రూలతలులోచ
నారుణకాంతిచే నట్టులయ్యె
వదలలేక నిరీక్షించువారి కవధి
దుస్సహంబయ్యె నీ మేనుదురమునందు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 46

**తాత్పర్యము :** జానకీరామ! భద్రగిరిరామ! రామభద్రా! దయాసముద్రా! సౌందర్యవంతుల స్తనముచే నొత్తిడి పొందదగిన నీ వక్షస్స్థలము యుద్ధసమయ

మందు వజ్రపుతలుపుగా మారినది. ఆశ్రితులకు అభయంప్రదము దానదాయకమైన నీ బాహువులు మహాసర్పసమానములైనవి. పూవుబోండ్లచే ముద్దిడుకొనదగిన అందమైన మోము, ప్రళయకాలపురాత్రి ప్రచండభాస్కరునివలె ఐనది. లలితములైన చెవులు నున్ననైన చెక్కిళ్లు, కనుబొమలు, కన్నుల ఎఱ్ఱదనముచే నెఱ్ఱదనముదాల్చినవి. నీ ముఖదర్శనమును వదలలేక చూచువారికి నీ మేను సహింపరానిదిగానుండెను.

**శరచతుర్దశ సహస్ర క్షపాటులంజంపి**
**అయాసపడని శౌర్యంబుఁజూచి**
**పురుషోత్తమఖ్యాతిఁ బొందుటకీవె ని**
**త్యార్హుండవనుచుఁ బెల్లాదరించి**
**పారికాంక్షులకు నభయదానమిచ్చువా**
**క్యము సెల్లెనని విస్మయమువహించి**
**శరణాగతులకెల్ల సాక్షాదమరభూజ**
**మగుట నేటికిఁ దెల్లమాయెననుచు**
**మెచ్చి పాలిండ్ల నొత్తి భూమిసుతనిన్నుఁ**
**గౌఁగిలించెను గద దండకావనమున**
**జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!**
**భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర!** **47**

**తాత్పర్యము :** జానకీరామభద్రా! దండకావనమున నీవు శరులైన పదునాలుగు వేల రాక్షసుల వధించి ఆయాసము పొందని నీయొక్క శౌర్యమును చూచి, పురుషోత్తముడను ప్రఖ్యాతిని పొందుటకు నీవే అర్హుడవని ఆదరించి, మునీశ్వరులకు అభయమిచ్చిన వాక్యము చెల్లింపబడినదని అచ్చెరువును పొంది, శరణన్నవారి పాలిటి కల్పవృక్షమవని అందరకును తెల్లమైనదని, నిన్ను మెచ్చుకొని తన స్తనములు నీ వక్షమును హత్తుకొనగా సీతాదేవి కౌగిలించినదికదా!

సర్వకాలము హెూమస్వాధ్యాయనిష్ఠచే
ఖ్యాతిఁగాంచిన పారికాంక్షిజనులు
నిఖిలయోగాభ్యాస నియతిచే నణిమాది
భూతులొందిన మహాపుణ్యజనులు
చాంద్రాయణాది ప్రశస్తవ్రతములచే
దినములు గడుపు యతిప్రవరులు
సారమంత్రములనుష్ఠానంబుఁ గావించి
సిద్ధినొందిన సుప్రసిద్ధమునులు

ఖరముఖాసుర సంహారకాలమందు
నిను నుతించిన మోదమిం తనవశంబె?
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 48

తాత్పర్యము : ఓ జానకీరామా! ఖరాసురుడు మొదలగు రాక్షసులను నీవు చంపినపుడు ఎల్లప్పుడు హోమక్రియలు చేయుచు, వేదపాఠములు చెప్పుచు, నియమనిష్ఠలతో కీర్తిగాంచిన పారికాంక్షులచే, వివిధములైన యోగాభ్యాస నియమములతో అణిమాగరిమాద్యష్టసిద్ధులందిన పుణ్యాత్ములచే, చాంద్రాయణాది ప్రశస్తమైన వ్రతాలతో దినములు గడుపు యతివరులచే, శ్రేష్ఠమంత్రములచే అనుష్ఠానాదులు కావించుచు సిద్ధిపొందిన ప్రసిద్ధమునులచే నీవు నుతింపబడితివి. అపుడు వారు పొందిన ఆనందమింతయని చెప్ప సాధ్యమగునా?

సౌందర్యలావణ్య సౌరభ్యసహితమై
తనరు నీవిగ్రహం బనుభవించి
ప్రాకృతాభావమై పరమపవిత్రమై
యలరుతావక చర్యలభినుతించి

సాధురక్షణధర్మ సంస్థాపనముదుష్ట
నిగ్రహం బొనరించు నేర్పువొగడి
సౌశీల్యకారుణ్య సౌలభ్యయౌవనా
ధ్యధిక కల్యాణగుణాళిఁ దెలిసి
ముక్తిఁజెందంగ వీలయ్యె మునివరులకు
నన్యులకు సాధ్యమగునె నిన్నరసికొల్వ?
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 49

తాత్పర్యము : ఓ జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమా! సౌందర్యము, లావణ్యము, సౌరభ్యములతో నిండియున్న నీ రూపాన్ని అనుభవించి, ప్రకృతిమాలిన్యములేని పరమపవిత్రమైన నీ చర్యలను ప్రశంసించి, సజ్జనులను రక్షించి ధర్మసంస్థాపనము కొఱకు దుర్మార్గులను నిగ్రహించిన నీ నైపుణ్యమును పొగడి, నీ సౌశీల్యకారుణ్య సౌలభ్యయౌవనాదులతో కూడిన అధికమైన కల్యాణగుణాలను పొగడి, మునివర్యులు మోక్షమును పొందుటకు సాధ్యమైనది. ఇతరులకు నీ మహత్త్వము తెలిసి సేవించుటకు సాధ్యమగునా? కాదని భావము.

సీతాయుతుండైన శ్రీరామచంద్రుని
తేజం బమేయమై తేజరిల్లు
వసుధాకుమారి నీ పాలిటిమృత్యువై
ప్రభవమొందెనుగదా! శుభచరిత్రుఁ
డగురామవిభునితోఁ బగవెట్టుకొంటివా?
నీ కుమారులులేరు నీవులేవు
లంకాపురములేదు లంకాపురస్థిత
రాక్షసవరులెల్ల రహినశింతు

రనుచు మారీచుండా రావణునకుంజెప్పెం
గాని రుచియింపదయ్యె నద్దానవునకు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 50

తాత్పర్యము : జానకీరామభద్రా! దయాసముద్రా! సీతాదేవితో కూడియున్న శ్రీరాముడత్యధిక తేజస్సుతో ప్రకాశించును. రావణా! భూపుత్రియగు సీతాదేవి నీ పాలిట మృత్యుదేవతయై అవతరించినది. శుభచరిత్రుడైన రామునితో విరోధము పెట్టుకొన్నచో నీ కుమారులు జీవింపరు, నీవు జీవింపవు. లంకా నగరముండదు. లంకలో నివసించు రాక్షసులు చేత్తురు. అని మారీచుడు చెప్పిన హితవాక్యములు రావణునకు రుచింపవయ్యెను.

నీ పరతత్త్వం బనేకరీతులం దాట
కేయుం డెరింగింపంగినిసిరావ
ణుండుచేంపరాంగ నిక్కడ నేను మరణింప
రావణుండీల్లం దారాముచేత
నని దలంపోసి మాయామృగంబగుచు మా
రీచుండు నీచే మరించెంగాని
యాసురప్రకృతియై నందున శరణొందం
జాలందయ్యెను విభీషణునిపోల్కి
జ్ఞానముండియు నీ పదధ్యాన మాచ
రింపలేరు దురాత్ములు రిక్తులగుచు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 51

తాత్పర్యము : ఓ జానకీరామచంద్రా! కృపాసముద్రా! నీ పరతత్త్వమును గురించి తాటకాపుత్రుడైన మారీచుడనేక రీతుల వచించెను. కాని అందులకు కోపించి

రావణాసురుడాతనిని చేంపబూనెను. నేనిచట ఈతనిచేతిలో మరణించినచో రామునిచే రావణుడు చేంపబడడని తలంచి, మాయలేడివలెపోయి రామునిచేతిలో మరణించెను. విభీషణుడు రాక్షసవంశములో పుట్టినను, ఆతనిలో రాక్షసప్రవృత్తి లేదు. అందువలన రాముని శరణువేడెను. మారీచుడు అసురప్రకృతి కలవాడు గనుక నిన్ను శరణుపొందలేకపోయెను. జ్ఞానముండియును దురాత్ములు నీపద ధ్యానము చేయలేక వ్యర్థులగుచున్నారు.

దోషహేతువులేక దుష్టదశగ్రీవు
    ననిఁజంప వీలుగాదని తలంచి
మైథిలినెడఁబాసి మాయామృగము వెంట
    జని వధించితివి వంచకనిశాటుఁ
దావక దివ్యావతారప్రయోజన
    మొనఁగూర్ప దేవతావనితలొందు
చెఱసాలలు దొలంగఁజేయ లంకాపురి
    కేఁగెజానకి తత్త్వమెఱుఁగలేని
పొలసులు వల్కు మాటలనాలకించి
నిలచియుండఁదరము గాదు నీరజాక్ష!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 52

**తాత్పర్యము :** జానకీరామా! భద్రాద్రిరామభద్రా! రావణాసురుడేదియో దోషమొనరింపనిదే వానిని చేంపుటకు వీలుకాదని భావించుటచే సీతాదేవిని విడిచి మాయామృగమువెంటపోయి, మోసగాడైన మారీచుని సంహరించితివి. నీయవతార ప్రయోజనమును నెరవేర్చుటకును, దేవతాస్త్రీలను రావణుని చెఱసాల నుండి విడిపించుటకును సీతాదేవి లంకానగరమునకు పోయి లంకయందున్నది. ఆ తత్త్వమెఱుంగని మూర్ఖులు పలుకు పలుకులు విని తట్టుకొనుటకు సాధ్యముకాదు.

జనకపుత్త్రిక జనస్థానంబునందొంటి
గానుండుసావిలోఁగాచి నిలిచి
పది కుత్తుకలవాఁ డపహరించినపుడు నీ
కిది నీతిగాదని హితవుఁదెలిపి
రావణాసురుతోఁ బరాబరి సమరంబుఁ
గావించి యతనిఁ జీకాకుపఱచి
చేచ్చినట్టి జటాయు సామీప్యమునకేఁగి
యియ్యుపకారికేమిచ్చి ఋణము
వాపుకొందు ననుచుఁబరీతాపమొంది
మోక్షమిచ్చితిగాదె ప్రమోద మొప్ప
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 53

**తాత్పర్యము :** జానకీరామా! భద్రాద్రిరామా! సీతాదేవి యొంటరిగా జనస్థానములో నుండుకాలమునందు రావణుడామెను హరించి తీసికొని పోవునపుడు "నీకిదిమేలుకా"దని హితముపదేశించి, రావణునితో సరిసమానముగాపోరి అతనిని చీకాకు పఱచి, వానిచేతిలో మరణించిన జటాయువు దగ్గఱకుపోయి "నీకేమిచ్చి ఋణము తీర్చికొందునని బాధపడి, అతనికి మోక్షపదవి నొసంగి సంతసించితివి కదా!"

నవయౌవనమున దినప్రభూష్ణంబుచేఁ
గమలిన నిజశరీరమునుబ్రోచి
దండకాటవి మహోద్దండక్షపాచర
కాండంబులకు లొంగకుండనుండి
నిఖిల నీడోద్భవానీకంబులకు సార్వ
భౌముఁడై రాజ్యసందలుదాల్చి

ప్రబలసౌఖ్యంబుచే వర్తించు తతి జటా
యువు నీ కొఱకు నిజాసువులు విడిచె
నందువలనఁ గదా మోక్షమందఁగలిగె
సాధనాంతరపరులకు సాధ్యమగునె?
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 54

**తాత్పర్యము :** జానకీరామా! భద్రగిరీంద్రధామా! కృపాసుధాసముద్రా! మంచి యౌవనమునందుండగా మధ్యాహ్నసూర్యకిరణములచే శరీరము కమిలిపోగా, జటాయువును చావకుండ రక్షించితివి. దండకారణ్యమందు క్రూరరాక్షసవర్గంబులకు లొంగకుండజీవించుచు, సమస్త పక్షికులమునకును సార్వభౌముడై రాజ్యసంపదలను పొంది అఖండమైన సుఖములు పొందుచు నాసమయమున జటాయువు నీకొఱకు ప్రాణములు విడిచెను. ఆ కారణముచేతనే మోక్షమును పొందగలిగెను. ఇతరమార్గములనుసరించు వారికి మోక్షమందుట సాధ్యమగునా?

జటాయువు అన్న సంపాతి. వారిద్దరొకనాడు పందెమువేసికొని సూర్యమండలమునకు పోవలయునని, ఎవ్వరు ముందుపోవుదురోయని పైపైకెగిరిరి. జటాయువు మిక్కిలి వేగముగా పైకిపోయి సూర్యకిరణ తాపము నోర్వలేక ఆర్తితో నరచెను. సోదరప్రేమతో సంపాతి పైకెగిరి తమ్మునకు సూర్యతాపము తగులకుండ తన రెక్కల నడ్డుపెట్టెను. సంపాతి రెక్కలు కాలిపోయి నిశాకరమహర్షి ఆశ్రమమున పడెను. జటాయువు దండకారణ్యమున జనస్థానమున పడెను.

జఠరాంతరస్థలోచనుఁడొకబంధాహ్వ
యముఁగాంచినట్టి సురారి యొకఁడు
యోజనాయతములై యొప్పు చేతులు సాఁచి
దొరికిన వన్యజంతువులఁ దినుచు

నొకనాడు సౌమిత్రియుతుఁడవౌ నినుబట్టి
భక్షింపఁగోర శుంభత్కఠార
మునుబూని తద్బాహులను ద్రుంచి శాపంబుఁ
బాపి గంధర్వరూపం బొసంగి

నతులుగాంచిన తావకాద్భుతచరిత్ర
మారయవశంబుగాదు శేషాహికైన
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 55

**తాత్పర్యము :** కడుపులో కన్నులు కలిగి కబంధుడను రాక్షసుడు కొన్ని ఆమడల పొడవులగ చేతులతో వానికందిన అడవి జంతువులనన్నింటిని పట్టి దగ్గఱకు లాగుకొని మ్రింగుచుండెను. ఒకనాడు లక్ష్మణునితో నీవాతని చేతులకు చిక్కితివి. ఆతడు మిమ్ములను తినబోగా కత్తులతో ఆతనిని నరికిచంపి, ఆతని శాపమును బాపి పూర్వగంధర్వరూపమిచ్చ ఆతనితో పూజలందుకొన్న నీ చరిత్ర మద్భుతముగదా! శేషుడైన నీ చరిత్ర మెఱుగలేడుగదా! రామభద్రా!

పూర్వము దనువను యక్షుడు కలడు. వాడు భయంకర రాక్షసరూపములతో మహర్షులను హింసించుచుండెను. దేవేంద్రుడాతనిని తన వజ్రాయుధముతో కొట్టెను. వాని శరీరమంతయు ఒక ముద్దగానైనది. ఇంద్రుడాతనికి పెద్ద పొట్టలో కన్ను నేర్పాటుచేసి, ఆమడల దూరము వ్యాపించు చేతులనిచ్చి వానికి చిక్కిన జంతువుల భక్షించునట్లు కల్పించెను. వాడు ప్రార్ధింప రామలక్ష్మణులాతనిని వధించినపుడు స్వస్వరూపము కలునని శాపవిమోచనమును తెల్పెను. సీతాన్వేషణకు పోవుచు రామలక్ష్మణులాతని బాహువులలో చిక్కుకొనిరి. ఆతని ప్రార్థనమేరకు కాష్ఠాదులు పేర్చి దహించిరి. ఆతడు నిజరూపమునంది, రామునినేకవిధముల స్తుతించి సుగ్రీవ వృత్తాంతమును చెప్పి విమానారూఢుడై వెడలిపోయెను.

అమంత్రణ మొనర్చినట్టి సంయమిగృహం
బులకు మున్నరుదుగాఁబోవు నీవు
సౌమిత్రితోఁగూడి శబరకులాంగ నా
శ్రమమెక్కడని గవేషణమొనర్చి
సరయతనేఁగి నిషాదికి దర్శనం
బింపుగా నొసఁగి తదీయ ఫలము
లారగించి తదంగ నార్చనల్ గైకొని
మోక్షంబొసఁగినావు ముదముతోడ

నీకృపకు హేతువాచార్య నిష్ఠతావ
కీనభక్తిగదా! పరికించిచూడ
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 56

**తాత్పర్యము** : జానకీరామా! నీవు సీతాలక్ష్మణసహితుడవై అరణ్యములకు పోయినపుడు ఆహ్వానించిన తాపసులగృహాలకు అరుదుగా పోవుచుంటివి. కాని లక్ష్మణసహితుడవై శబరాంగనయగు శబరీ ఆశ్రమమెచ్చటని వెతకి, వేగముగా నటకుపోయి, ఆమెకు దివ్యదర్శనమిచ్చి, ఆమె యిచ్చిన ఎంగిలిపండ్లారగించి, ఆమె అర్చనలు గ్రహించి మోక్షమొసంగితివి. నీ దయకు, ఆమె ఆచార్యనిష్ఠ, నీపదభక్తియేకదా కారణము.

శబరిమతంగ మహర్షి శిష్యురాలు. ఆయన బ్రహ్మలోకమునకు పోవుచు, రాముడరణ్యావాసమునకు వచ్చెనవియు, సీతాన్వేషణ సమయమున తప్పక ఈ యాశ్రమమునకు వచ్చుననియు, ఆయన కాతిథ్యమిచ్చి బ్రహ్మలోకమునకు రావలసినదని ఆదేశించెను. ఆ రోజునుండి ప్రతిదినమును అడవియందలి ఫలములను తెచ్చి కొరికి రుచిచూచి, తీపిఫలములను రామాతిథ్యము కొఱకు ఉంచి మిగిలినవి పారవేయుచుండెను. ఇట్లు పదునాలుగేండ్లు కడచను

సమయమున లక్ష్మణసహితుడై రాముడాశ్రమమునకు వచ్చి ఆమె యిచ్చిన ఎంగిలిపండ్లుతినెను. రాముని సన్నిధానముననే శబరి యోగాగ్నిచే దేహమును దగ్ధమొనర్చికొని ఉత్తమలోకములకు పోయెనని, పూర్వాచార్యులు వివరించిరి. ఎంగిలిపండ్ల విషయము వాల్మీకమున లేదు.

**పావనంబగు పదప్రక్షాళనమునకు**
**స్నానపానములకు జలములిచ్చి**
**హల్లకసౌగంధి కాంభోరుహేందీవ**
**రాదిపుష్పములచే నర్చసలిపి**
**నిజతటోద్భూతావనీరుహచ్ఛాయల**
**మార్గాప్త దేహశ్రమముదొలంచి**
**తననీటమిశ్రమై చేనుదెంచుమలయవా**
**యువులచే స్వేదబిందువులడంచి**

**కూర్మితో నీకు మోదంబుఁగూర్చి పంప**
**లెస్సగాఁగీర్తిఁగాంచె సరస్సులందు**
**జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!**
**భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర!** **57**

**తాత్పర్యము :** ఓ జానకీరామా! నీవు సుగ్రీవుని కిష్కింధాకపిరాజ్యమునకు పట్టము గట్టించి, వానకాలము నాలుగు మాసములును, ఋష్యమూకముపై పంపా సరోవరతీర గుహలో లక్ష్మణసహితుడవై వసించితివి. అప్పుడా సరోవరము. నీ పవిత్రపాదములు కడుగుకొనుటకును, స్నానమునకును, త్రాగుటకును కమ్మని నీరిచ్చినది. ఎఱ్ఱతామరలు–సౌగంధికములు–పద్మములు–ఎఱ్ఱకలువలు మొదలైన పూవులతో నిన్ను అర్చించినది. తనగట్టునగల చెట్లనీడలచేత నీకు మార్గాయాస దేహశ్రమను బాపినది. తనలోని పూవుల వాసనలతో వ్యాపించు పైరగాలితో నీ చెమటలను పోగొట్టినది. ఈ విధముగా నీ కానందమును కల్గించిన కారణముచే పంప సరస్సులందు మేటియైనది.

కళికాలతాపుష్ప ఫలపత్రపల్లవా
స్పదములై తనరారు పాదపములు
శారికాకీర మయూరతామ్రాక్షాది
ఖగకృతమాధుర్యకలితరవము
రమ్యలతాంత మరందపానంబుచే
రేఁగికావించు ద్విరేఫరవము
వనసమీపమునఁ బావనతోయరాజీవ
భాసితంబైన పంపాసరస్సుఁ
జూచిదుఃఖించితివిధరాసుతఁ దలంచి
శ్రితులులేకున్న సుఖము రుచింపదెపుడు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 58

**తాత్పర్యము :** ఓ సీతారామా! ఆ పంపా సరోవరతీరమున, మొగ్గలు, తీవలు, పూలు, పండ్లు, ఆకులు, చిగురుటాకులతో కూడిన చెట్లును, గోరువంకలు, చిలుకలు, నెమళ్లు, పైడికంటివంటి పక్షులు చేయు మధురధ్వనులును, అందమైన పూలయందలి తేనెలు త్రాగుటచే మదించి ఝుంకారములు చేయు భృంగముల రావములును, అడవిసమీపమున పవిత్రజలముతో తామరలతో ప్రకాశించు పంపా సరోవరమును చూచి, సీతాదేవిని తలచుకొని, ఎంతో దుఃఖించితివి. ఐనవారులేనపుడెంత సుఖమైనను అనుభవించుటకు రుచికరముకాదుగదా!

ఈ పద్యమున మరియొక మనోజ్ఞ శృంగారభావమున్నది. మొగ్గలు సీతాదేవి పలువరసవలెనున్నవి. తీవలు ఆమె చేతులవలెనున్నవి. తామరలామె నేత్రములవలెనున్నవి. చిలుకల పలుకులు సీతావాక్యములవలె నున్నవి. పల్లవములామె పాదములవలె నున్నవి. తుమ్మెదలామె నల్లని వెంట్రుకల గుంపువలెనున్నవి. ఆ సరోవరమును చూడగా సీతాదేవియే గుర్తువచ్చుచున్న హేతువున రాముడు దుఃఖించెను.

గనిలోని మానికంబునుబోలె సంగీత
సాహితీపటిమ శస్తంబుగాక
భస్మావృతుండైన పావకుగతి బాహు
బల మరాతుల ద్రుంపఁ బనికిరాక
దీపంబులేని మందిరమట్లు లౌకిక
వైదికజ్ఞానంబు వాసిఁగనక
శరదాగమాపగా సలిల ప్రవాహంబు
సరణి వాగ్విభవంబు సన్నగిల్ల

వెతలుగన్న సమీరణ సుతుఁడు తావ
కీనదర్శనమున గదా కీర్తిఁగాంచె
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 59

**తాత్పర్యము :** ఓ జానకీరామా! నీ దగ్గరకు రాకముందాంజనేయుడు, గనిలో ఉన్న మాణిక్యమువలె సంగీతసాహిత్యపటిమ వ్యక్తముకాక, బూడిదతో కప్పబడి యున్ననిప్పు కణికవలె తన బలము శత్రువులను చంపుటకు పనికిరాక, దీపము లేనిమందిరమువలె తన లౌకికవైదికజ్ఞానము వన్నెకెక్కక, శరత్కాలమున తగ్గిపోయిన నదీజలప్రవాహమువలె వాగ్వైభవము బాగుగా సన్నగిల్లి బాధలందెను. నీ దర్శనము తరువాతకదా! హనుమంతుడు కీర్తినందినది.

తనకు దినేంద్రనందనునకు వాలిచేఁ
బొడమునపాయ మెప్పుడు దొలంగుఁ
బోయినరాజ్యంబుఁబూఁబోఁడి ప్రాప్తింప
సుగ్రీవుఁడేనాడు సుఖముఁగాంచు

నలనీలతారాదినగచరులకు నాకు
స్వైరవిహారమేసాఁగలుగు
ననవరతంబు వాంఛానుకూలంబుగా
వసనాశనంబు లేవగల లభించు

నని కృశింపుచు నున్న పావనికి నీవు
దర్శనంబీయఁగా దుఃఖతతినశించె
జానకీరామ! బ్రహ్మాండ సార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 60

**తాత్పర్యము :** ఓ జానకీరామచంద్రా! ఆంజనేయుడు తనకు, సూర్యపుత్రుడగు సుగ్రీవునకు వాలివలన కలుగు కీడు ఎప్పుడు తొలగిపోవునో? పోయిన రాజ్యమును, వాలిచే నపహరింపబడిన నిజ భార్యరుమను పొంది సుగ్రీవుడెప్పుడు సుఖించునో? నీలుడు - నలుడు - తారుడు మొదలైన వానరులకు తనకు స్వేచ్ఛగా విహరించు కాలమెప్పుడు కలుగునో? ఎల్లప్పుడును తమ కోరికల కనుకూలముగా వస్త్రములు ఆహారములే తీరుగా లభించునో? అని కృశించుచున్న హనుమంతునకు నీ దర్శనమైన తదుపరి దుఃఖము నశించినది.

కడిమి నీ కడకువే నడచివచ్చుటచేఁ జ
రణములు సుకృతాచరణములయ్యె
నేకాంతభక్తితో నీకు మ్రొక్కుటఁజేసి
కరములు పావనాకరములయ్యె
భవదీయ దేహప్రభాలబ్ధిచే స్వవీ
క్షణము లమోఘ లక్షణములయ్యె
నొనరఁగా నీ నామ ముచ్చరించుటచే ర
సజ్ఞసత్కవితారసజ్ఞయయ్యె

శ్రుతులు శ్రుతులయ్యె నీమాట సోఁకగా, స
మీరసుతునకుఁ బంపా సమీపమందు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 61

**తాత్పర్యము :** జానకీరామా! వాయుసుతుడు ఆంజనేయుడు పంపా సరోవర సమీపమున నీ దగ్గరకు వచ్చుటచేతనేకదా, ఆయన చరణములు పుణ్యమును చేసికొనినవైనవి. ఏకాంతమందు భక్తితో నీకు మ్రొక్కుటచేత ఆయన కరములు, పావనత్వమునకు స్థానములైనవి. నీ దేహకాంతిని పొందుటచే ఆయన కన్నులు (చూపులు) అమోఘలక్షణములు కలవైనవి. చక్కగా నీ నామమునుచ్చరించుట చేతనే ఆయన నాలుక కవిత్వరసము నెఱింగినదైనది. నీ మాటవలననే ఆయన వీనులు వేదములైనవి.

కన్నుల కలిమికిక్కడగదా! పురుషార్థ
మొనఁగూడె ననిభవత్తనువుఁగాంచి
నోరున్నఫలముచేకూరెనేఁడని పొండి
తీసరస్వతులచేఁ దివిరిపొగిడి
తలఁపున్న పుణ్యమిత్తఱి లభించెనటంచు
మాటిమాటికి భవన్మహిమలెన్ని
జన్మమీనాటికి సాఫల్యమయ్యెఁ బొ
మ్మని సలక్ష్మణుఁడవౌ నినువహించి
తీసికొనిపోయి రవిజుని వాసమందు
దించెఁగద! వాయుసుతుఁడు విరించిజనక!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 62

తాత్పర్యము : జానకీరామా! ఆంజనేయుడు, "ఆహా! కన్నులున్నందులకు ఈ రాముని చూచిన తరువాత కదా! పురుషార్థఫలము కలిగినదని నీ శరీర సౌందర్యమును చూచి, నోరున్నదానికిది కదా! ఫలమని పాండితీభరిత వాక్కులతో నిన్ను ప్రశంసించి, మనస్సునందు భావించుచున్న పుణ్యమిప్పుడు లభించినదని మాటిమాటికి నీ మహిమలను వచించి, ఈనాటికి జన్మ సఫలమైనదని లక్ష్మణునితో కూడిన నిన్ను తన భుజములమీద కూర్చుండబెట్టుకొని తీసికొనిపోయి సూర్యసుతుడగు సుగ్రీవుని కడ దింపెను.

పాంథుండు దారిలోపలఁ బిపాసార్తిచేఁ
గుందిగంగాంబువుల్ గ్రోలినట్లు
లేమిచే దద్దరిల్లెడు దరిద్రుఁడు లస
త్సేవధి నవక మార్జించినట్లు
సర్పవిషముచే విషాదమొందినవాఁడు
వినతాత్మజకటాక్ష మెనసినట్లు
యామినీశైత్య బాధాన్వితుఁడైన వాఁ
డగ్ని సాన్నిధ్యమందలరినట్లు
నిన్నుఁగని సూర్యనందనుఁడెన్నరాని
మోదమందెనుగద! ఋశ్యమూకమందు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 63

తాత్పర్యము : జానకీరామభద్రా! దాహముతో బాధపడు బాటసారి, దారిలో గంగాజలమును త్రావినట్లుగా, కటికదారిద్ర్యముతో బాధపడు నిఱుపేద నవనిధులను పొందినట్లుగా, సర్పవిషముచే బాధపడువాడు గరుత్మంతుని అనుగ్రహముచే విగతవిషుడై ఆనందించినట్లుగా, రాత్రివేళ చలిబాధతో

కూడినవాడు అగ్నిజ్వాలముందు చేరి చలి కాచుకొన్నట్లుగా నిన్నుచూచి సుగ్రీవుడు ఋశ్యమూకపర్వతముపై ఎంతో ఆనందించెను.

శాఖామృగంబని సందేహమొందక
కడువేడ్కతోడ సఖ్యంబొనర్చి
పరిపంథిఁగూల్చి నిర్భరరాజ్య సుఖమునీ
కర్పింతునని యభయంబొసంగి
కొండకైవడిఁదోఁచు చుండుదుంధుభి కళే
బరమొక్క వ్రేలితోఁ బాఱఁదన్ని
అభ్రంకషములై మహావిశాలములైన
సాలాగములనొక్క కోలఁగూల్చి
నమ్మకముఁగూర్చి సుగ్రీవునుమ్మలికను
పోవఁద్రోసిన శక్తినిమ్ముల నుతింతు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 64

**తాత్పర్యము :** జానకీరామా! సుగ్రీవుడు వానరుడని కొంచెముకూడ సందేహింపక, సంతోషముతో స్నేహముచేసి, శత్రువైన వాలిని చంపినీకు నిర్భరరాజ్యసౌఖ్యము నర్పింతునని అభయమిచ్చి, కొండవలె కన్పించు దుందుభిశరీరమును బొటనవ్రేలితో పైకెగమీటి, ఆకాశమునంటుకొనుచు విశాలముగా పెరిగిన ఏడు మద్దిచెట్లు నొక్కబాణముచే కూలవేసి, సుగ్రీవునకు వాలిని చేంపగలవాడను నమ్మకమును కల్పించి, సుగ్రీవుని బాధను పూర్తిగా పోద్రోలిన నీ శక్తిని ఎంతని నుతింతును?

**దుందుభి చరిత్రము :** ఈతడొక రాక్షసుడు, క్రొవ్వి హిమాలయమును తన కొమ్ములతో గ్రుచ్చి ఎత్తుచు, తనతో పోరుటకు రమ్మని హిమవంతుని ఆహ్వానించెను. హిమవంతుడు తాను యుద్ధము చేయుటకు చాలననియు

సముద్రుడు సమర్థుడని చెప్పెను. అతడు సముద్రనిపైకి పోయెను. తాను చాలననియు కిష్కింధాపురిని పాలించు వాలి సమర్థుడనియు ఆతని కడకు పొమ్మనెను. దుందుభివచ్చి వాలియొక్క మధువనమును నాశమొనరించి వాలిని యుద్ధమునకు పిలిచెను. వాలి దుందుభితో యుద్ధముచేసి, ఆతనిని చంపి, క్రోధమును పట్టజాలక గిరగిర త్రిప్పివాని శవమును విసరివైచెను. ఋశ్యమూక పర్వతముమీద మతంగమహర్షి తపస్సుచేసి కొనుచుండెను. ఆ శవము మహర్షి తపోవనము నందలి వృక్షములను విరచుచు, రక్తధారలతో ఆశ్రమప్రాంతమును పాడుచేసి దూరముగా పడెను. మతంగమహర్షికి కోపమువచ్చి ఈ యాశ్రమమును రక్తబిందువులచే అపవిత్రమొనర్చిన ఆ వాలిగాని, ఆతని సంబంధులుగాని ఈ పర్వతముపై నున్నచో వెంటనే దిగిపొండు. రేపు ఉదయము మొదలు వాలిగాని ఆతని సంబంధులుగాని, ఈ పర్వతముపైకి వచ్చినచో వెంటనే మరణింతురుగాకయని శపించెను. ఆ వార్తవిని వాలి పరుగునవచ్చి మహర్షి పాదములపైబడి శాపముపసంహరింపుమని అర్థించెను. మునిమెత్తబడక ఆశ్రమములోనికి వెళ్ళిపోయెను.

ఇది అవకాశముగా తీసికొని సుగ్రీవుడు ఋశ్యమూకముమీద హాయిగా నివసించుచున్నాడు. ఆంజనేయుడు రామలక్ష్మణులను తీసికొనివచ్చి సుగ్రీవునితో స్నేహము కూర్చినాడు. అప్పుడు రాముడు వాలిని చంపి కపిరాజ్యానికి నిన్ను పట్టాభిషేకము చేయుదునని సుగ్రీవునకు మాట ఇచ్చినాడు. ఐనను రాముడు వాలివంటి మహాబలవంతుని సంహరింపగలడా?యని సుగ్రీవుడుసంశయించెను. ఆ సంశయ విచ్ఛేదము కొఱకు, సుగ్రీవుని కోరికమేరకు, రాముడు ఒక కొండవలె నున్న దుందుభి కళేబరమును, కుడికాలు బొటనవ్రేలితో పైకి విసరెను. అది వాయుమండలమును దాటి యెగసెను. అది క్రిందపడలేదు.

వాలి విసరినపుడాతని శరీరము రక్తమాంసములతో కూడా చాల బరువుగానున్నదనియు, అది వానకు తడిసి ఎండకెండి బుగిలిపోయినదనియు,

కావున దానిని విసరినంతమాత్రమున సుగ్రీవుడు రాముని వీర్యమును విశ్వసింపజాలననెను.

వాలి కన్పించుచున్న ఒక్కొక్క భూరి వైశాల్యముగల సాలవృక్షమును చేతితో బాణమును విసరి చీల్చుచుండెననియు, రాముడు బాణముతో దానిని భేదించినచో నమ్మెదననెను. రాముడు ధనుస్సున బాణమును సంధించి, ఆకర్ణాంతరముగా లాగివైచెను. అది వరుసగా ఉన్న ఏడు మద్దిచెట్లను నరికివేసి, పర్వతశృంగమును భేదించి పాతాళమునకు పోయి తిరిగివచ్చి రాముని అమ్ములపొందియందు దూరెను. అది కాంచిమిక్కిలి అచ్చెరువంది సుగ్రీవుడు రాముని పాదములపై బడెను.

ఇనసుతుండును నీవు మునుసఖ్య మొనరించి
సల్లాపములొనర్చు సమయమందుఁ
జామీకరోపమచ్ఛవులతో భాసించు
వేమాఱు తగువాలి వామదృష్టి
జ్వలనోపమాన విస్తారోష్ణరుచులచే
నెసఁగు రావణుని వామేక్షణంబు
సంచలించెను జోవుసమకూడెనని చెప్పి
యపుడె జానకికి వామాక్షియదరి

శుభముఁ దెల్పెభవద్వచస్సులటులైన
విక్రమంబెంత యనవచ్చు విష్ణుదేవ!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 65

తాత్పర్యము : ఓ జానకీరామభద్రా! నీవు సుగ్రీవుడు అగ్నిసాక్షిగా స్నేహమును చేసి సల్లాపములాడు సమయమందు బంగారుకాంతులతో ప్రకాశించు వాలియొక్క ఎడమకన్ను ఎన్నోమార్లు కొట్టుకొన్నది. అగ్నిజ్వాలతో సమానమైన విశాలమైన

వేడిమితో అతిశయించు రావణుని ఎడమకన్ను అదిరినది. వాలి-రావణుల చావు తప్పదని తెలియచేసినట్లు అదే సమయమున సీతాదేవి ఎడమకన్ను అదిరి శుభమను తెలియజెసెను. అట్టి రామా! నీ విక్రమంబెంత అనవచ్చు? నీవే విష్ణుస్వరూపుడవు.

స్త్రీలకు ఎడమకన్నదురుట రాగలశుభమును తెలియచేయునని, పురుషులకు ఎడమభాగమదరుట కీడును తెలియచేయునని శకునశాస్త్రము తెలియచేయుచున్నది. "సుగ్రీవరామప్రణయప్రసంగే - వామానినేత్రాణి సమం స్ఫురంతి" అన్న వాల్మీకి శ్లోకమునకు భాష్యరూపమే ఈ పద్యము.

**సంగరంబునవాలిఁజంపెదనన్నచోఁ**
**దనపురంబున కేగి దాఁగెనేనిఁ?**
**బురములోనికి నీవు పోవవీల్గాదయ్యె**
**వనవాసదీక్షఁ గైకొనుటఁజేసి**
**యటుగాక శరణార్థియైనచో రక్షింప**
**వలయు రక్షితుఁడైన వాలివెళ్ళి**
**రావణాసురుఁదెచ్చి రక్షింపుమన్న నీ**
**వటు చేయవలయు నట్లైనమీఁద**
**దేవతలొనర్చు శరణాగతికి ఫలంబు**
**కలుగక నశించుఁగాదె యో కౌసలేయ!**
**జానకీరామ! బ్రహ్మాండ సార్వభౌమ!**
**భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర!** **66**

**తాత్పర్యము :** కౌసల్యాపుత్రా! జానకీరామభద్రా! ఒకవేళ నీవు సంగ్రామమునందు వాలిని చంపెదనని బాహాటముగా ప్రతిజ్ఞ చేసినచో వాలి తన పురమున దాగవచ్చును. వనవాసదీక్షలోనున్న రాముడు పురములోనికి పోవుటకు వీలుకాదు. అట్లుకాక వాలి శరణన్నచో ఆతనిని రక్షింపవలయును. ఆతడు

రక్షింపబడి రావణాసురుని తీసికొనివచ్చి రక్షింపుమన్నచో ఆతనిని రక్షింపవలసి వచ్చును. రావణుని రక్షించినచో దేవతలు రావణవధ చేయుమని నీకు చేసిన శరణాగతి వ్యర్థమగునుకదా!

**పారిపోకున్నచో వాలి నీవు వధింప**
**శక్రదత్తవరంబసత్యమగుట**
**వలన నింద్రునకపవాదంబు సిద్ధించు**
**శక్రారులైన రాక్షసులఁ జంప**
**నవతరించిన నీకనర్హమక్కార్య మా**
**ఖండల వరమలంఘ్యంబుగాదు**
**తమ్ముఁడుండంగ నాతని భార్యరుమఁగొన్న**
**వాలివధ్యుండయ్యె వధ్యునెట్లు**

**సంహరించినగాని దోషంబులేదు**
**గానఁజెక్కాడితివి చాటుగావసించి**
**జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!**
**భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర!** **67**

**తాత్పర్యము :** ఓ జానకీరామా! వాలి పారిపోకున్నచో రణరంగమున నీవు వాలిని వధింపవలయును. దేవేంద్రుడాతని ఎదురుగా నిల్చి ఎవ్వరు రణమొనర్చినను, ఆతని శక్తి వాలిని చెందునని వరమిచ్చెను. ఆ వరమిప్పుడు నీవు చంపిన అసత్యమగును. దానివలన ఇంద్రునకపకీర్తి కలుగును. దేవేంద్రుని శత్రువులైన రాక్షసులను చేంపుటకోసమే నీవవతరించితివి. అట్టి నీవు ఆతని నవమానించుట తగదు. దేవేంద్రుని వరము తిరస్కరింపరాదు. వాలి తమ్ముడైన సుగ్రీవుడు జీవించియుండనాతని పత్నిరుమను తాను గ్రహించెను. ఆ దోషముచే ఆతడు చేంపదగినవాడయ్యెను. కనుక వానినెట్లు చేంపినను దోషముకాదని తలంచి చెట్టుచాటునుండి చేంపితివి.

వానరజాతిలో ఒక నియమము కలదు. అన్నదమ్ములలో ఎవ్వరు మరణించినను, అతని భార్యను జీవించినవ్యక్తి స్వీకరింపవచ్చును. బ్రతికియున్న సోదరుని భార్యను గ్రహించినచో మరణశిక్ష విధింపవలయును.

చేటుగానుండక సమరరంగంబున
నెదిరింప వాలి నీప్రదరహతి, మ
రింపకుండ వశంబె? రేఁగినిల్చిన ఖర
త్రిశిరులుమున్ను వధింపఁబడరె?
రావణకుంభకర్ణవిరాధులీల్లరే
వాలినొక్కమ్ముచేఁగూలనేసె
రాముఁడెంత ఘనుండురా!యని సమకాలి
కులు నుతించిరికాదె! కొంటెమాట
లాడరైరిగదా! కలియందుఁబుట్టి
దనుజలను, పాడుమాటలఁదలఁపవశమె?
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 68

**తాత్పర్యము :** ఓ జానకీరామా! వాలిచేటుగానుండక యుద్ధరంగమున నిన్నెదిరించినచో అతడు నీ బాణహతిచే చావకుండ బ్రతుకగా వశమగునా? విజృంభించి నిల్చిన ఖరాసురుడు త్రిశిరుడు మొదలైన రాక్షసులు చేంపబడలేదా? రావణుడు, కుంభకర్ణుడు, విరాధుడు నీచేత మరణించిరికదా! వాలి ఒకే ఒక బాణముచే కూలెను. ఆహా! రాముడెంత గొప్పవాడురా! యని సమకాలికులు నిన్ను నుతించిరి. రాక్షసులు కూడ నినుగూర్చి కొంటెమాటలాడరు. కలికాలమున నేడు పుట్టిన దనుజరూప నరులు మాటాడు చెడ్డమాటలిట్టివని తలంపశక్యమా? కాదు.

తనతేనిఁగూల్చినావని నిన్ను శపియింపఁ
దలఁచి వచ్చిన తార కలుషముడిగి
సుమశిలీముఖకోటి సుందరంబగు భవ
త్కమనీయ దివ్యవిగ్రహముఁగాంచి
వలపొంది నిజకుచంబులయందు ముఖసక్థి
కరలోచనములఁ బుల్కలుజనింపఁ
బరిరంభమొనరింపఁ దరముకాదని దిగు
ల్పడి సన్నుతించె నభ్రంపునుడుల

వానరాంగనకట్టి సుజ్ఞానమిడిన
సోయగము భక్తులకు వాంఛలీయకున్నె?
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 69

**తాత్పర్యము :** ఓ జానకీనాథా! రామభద్రా! కరుణాసముద్రా! తనయొక్క భర్తయైన వాలిని చంపినావని నిన్ను శపింపవలెనని తార కోపముతో వచ్చినది. తన కోపమును విడిచి, కోటిమన్మథుల సౌందర్యముతో సమానమైన నీ దివ్యమంగళ విగ్రహమును చూచి, నీయందనురాగము జనించినది.ఆమె స్తనములు, ముఖము, తొడలు, చేతులు, కన్నులు పులకించినవి. నిన్ను కౌగిలించుకొనవలెనను భావమున్నను, అది సాధ్యము కాదని నిన్ను ప్రశంసించెను. ఒక వానరస్త్రీకి అంతటి విజ్ఞానమొసంగిన నీయందము భక్తులకోరికలు తీర్పకుండునా?

గూఢస్వయంప్రభాగుహఁజేరి మృష్టాన్న
భక్ష్యపానములచే బడలికేది
గిరిచరాళులు బహిష్కృతులై సమయభంగ
మాయె–జానకితోఁపదాయెననుచు

నేకీభవించి నీరాకరతటమందు
సవిరి ప్రాయోపవేశంబొనర్చు
సావిసంపాతి నచ్చేటఁ జూపి కార్యసా
ధనమార్గమతనిచే వనచరులకుఁ
దెలియఁజెప్పించినావు నిన్నలఘుభక్తిఁ
దలఁచు వారి కపాయముల్ దొలఁగుటరుదె?
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 70

**తాత్పర్యము :** జానకీపతీ! భద్రాద్రి రామభద్రా! దయాసాంద్రా! సీతాన్వేషణమునకై బయలుదేరిన, అంగద–నీల–నల–జాంబవద్ధనుమదాది వానరవీరులు స్వయంప్రభా గుహలో చేరినారు. అందు ప్రవేశించినవారు తిరిగిరారు. కాని అక్కడకు పోయి వానరవీరులు ఇష్టమైన భోజనముతో, భక్ష్యపానీయములతో తమ అలసటను పోగొట్టుకొనిరి. నెలరోజులలోపల తిరిగివచ్చి, సీతావార్త చెప్పకున్నచో వారికి మరణశిక్షను విధింతునని సుగ్రీవుడు శాసనము చేసెను. ఆ కాలము దాటిపోయినది. సీతాదేవి కన్పించలేదు. వానరవీరులందఱు కలిసి దక్షిణసముద్రతీరములో ప్రాయోపవేశమొనర్చిరి. అపుడు జటాయువు అన్నయగు సంపాతి వచ్చి సీతాదర్శనమగు మార్గమును చెప్పెను. ఆవిధముగా నీవు వానరవీరులకు విషయమును తెలియచేసినావు. నిన్నధికభక్తితో సేవించువారికి కీడులు తొలగి అపాయములు తొలగుట అరుదా? కాదు.

## సంపాతి వృత్తాంతము

సంపాతి జటాయువు సోదరుడు. వారిద్దరు సూర్యమండలమునకు పందెమువేసికొని ఎగిరిరి. జటాయువును రక్షించుటకు సంపాతి తన రెక్కలతో తమ్ముని కప్పివేసెను. సూర్యకిరణతీక్ష్ణతచే, ఆతని రెండు రెక్కలు కాలిపోయినవి.

అతడు నిశాకరమహర్షి ఆశ్రమమునందు పడెను. మహర్షి సంపాతితో నేను నీకు రెక్కలు ప్రసాదింపగలను. కాని నీవు సీతాన్వేషణార్థమై యిచ్చేట వచ్చిన కపులకు సీతావిషయమును చెప్పవలసియున్నది. కనుక నీవిక్కడనేయుండి వారికి సీతావిషయమును చెప్పినపుడు నీకు ఱెక్కలు వచ్చునని తెలిపెను.

సుగ్రీవుడిచ్చిన సమయము దాటిపోవుటచే, అంగదుడు సముద్రతీరమున ప్రాయోపవేశము చేసెను. వానితోపాటు వానరులందరును ప్రాయోపవేశము చేసిరి. ఆ సమీపమందున్న సంపాతి, తనకు భగవంతుడీరీతిగా ఆహారము సమకూర్చెనని మెల్లగా నక్కడకు వచ్చుచుండెను. అపుడు వానరులు, రాము డరణ్యమునకేల రావలె? రావణుడు సీతాదేవి నేల అపహరింపవలె–జటాయువు రావణునిచేతిలో మరణించుచు రామునకేల ఆ వృత్తాంతము చెప్పవలెనని వారిలోవారు అనుకొనుచుండిరి. ఆ మాటలువిని సంపాతి జటాయువు విషయమును వారివలన తెలిసికొని దుఃఖించెను. ఒకనాడు తన కుమారుడు సుపార్శ్వుడు ఆహారార్థము సముద్రతీరమున నుండగా రావణుడొక స్త్రీని బలవంతముగా రథముపై తీసికొనిపోయెననియు, మహర్షులామె రామపత్నియగు సీతాదేవి యనియు ఆతడు రావణుడని చెప్పిరని, తనకు చెప్పినట్లు సంపాతి చెప్పెను. ఆమె రావణుని అశోకవనికలో నున్నదని తెల్పి, ఱెక్కలురాగా వినీలాకాశమున నెగిరిపోయెను.

**శతయోజనవిశాల జలధి దాటెడువేళఁ**
**పవమాన గరుఁడాభజవమొసంగి**
**లంకలో వెదకు కాలమున వాచస్పతి**
**శతకసమాన యోచనలొసంగి**
**రూక్షాక్షముఖరాక్షసక్షయాహవమందుఁ**
**బరిమితిలేని దోర్బలమొసంగి**

సీతనీక్షించి భాషించునప్పుడు వాక్ప
తీజానితుల్య ప్రతిభనొసంగి
హనుమ నీవోమినావు వాలాగ్నిఁగూర్చి
నప్పుడాతని రక్షించె నవనిపుత్రి
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 71

**తాత్పర్యము :** జానకీపతీ! భద్రగిరివాసా! ఆంజనేయుడు నూరామడల వెడల్పుగల విశాలసముద్రను దాటెడు సమయమున, వాయువుతో గరుడునితో సమానమైన వేగమునిచ్చి, సీతాదేవి కొఱకు లంకలో వెదకు కాలమున కోటి బృహస్పతుల ఆలోచనము సమకూర్చి, భయంకరులైన అక్షుడు మొదలైన రాక్షసులను యుద్ధమందు సంహరించువేళ నిరుపమాన బాహుబలమునిచ్చి, సీతాదేవిని చూచి, ఆమెతో మాటాడునపుడు బ్రహ్మదేవుని ప్రతిభతో సమానమైన ప్రతిభనిచ్చి ఆయనను రక్షించితివి. రాక్షసులాయన తోకకు నిప్పంటింపగా సీతాదేవి, అగ్నిబారినుండి హనుమంతుని కాపాడినది. ఎవరో రాక్షసస్త్రీ వచ్చి సీతాదేవితో, హనుమంతుని వాలమునకు నిప్పుపెట్టిరని తెలిపెను. అపుడు ఆమె "శీతోభవహనూమత" ఓ అగ్నిదేవా! హనుమంతునకు చల్లగానుండుమని శాసించెను. ఆంజనేయునకాయగ్ని మంచిగంధమును పూసినట్లుగానయ్యెను.

ప్రమదావనధ్వంసనము నాడదభ్రమై
పొలివోని జవసత్త్వములనమర్చి
ధాతృపృషత్కబంధనమూడ్చుచోనమే
యప్రభావము నుపాయంబుఁగూర్చి
లంకఁగాలుచువేళలను వహ్నిగతిదాహ
కవ్యాపనంబులు గలుగఁజేసి

రావణాసురునిఁ దిరస్కరించెడువేళ
సాహసధైర్యముల్ సరవినొసఁగి
పావనినిఁగీర్తిఁ జెందించినావు విజయ
లక్ష్మియైప్రోచె సీతాలలామమరసి
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 72

**తాత్పర్యము :** ఓ జానకీరామా! దయాధామా! ఆంజనేయుడు అశోకవనికను ధ్వంసమొనర్చువేళ ఏమాత్రమును తరుగని బలమును వేగమును కూర్చితివి. బ్రహ్మాస్త్రబంధము ఊడిపోయినవేళ అత్యధికప్రభావమును ఉపాయమును సమకూర్చితివి. లంకకాల్చునపుడు అగ్నికి అధికదాహశక్తియు వ్యాపించుగుణము నొసంగితివి. రావణాసురుని తిరస్కరించి పలుకువేళ అతిలోక ధైర్యసాహసముల నిచ్చితివి. ఈవిధముగా వాయుపుత్రునకు కీర్తినిచ్చితివి. సీతాదేవి విజయలక్ష్మియై ఆతనిని రక్షించినది.

హనుమంతుడు అక్షకుమారుని చంపిన పిదప ఇంద్రజిత్తు రణమునకు వచ్చి బ్రహ్మాస్త్రమును వేసెను. చిన్నపుడు దేవేంద్రుని వజ్రముచే కొట్టబడినపుడు బ్రహ్మదేవుడు తన అస్త్రమువలన ప్రమాదములేకుండ హనుమంతునకు వరమిచ్చెను. కనుక అది ఆయనను చంపక కేవలము బంధించినది. మూర్ఖులగు రాక్షసులు పడిపోయిన హనుమంతుని బలమైన తీగలతో బంధించిరి. ఇతర బంధములున్నచో బ్రహ్మాస్త్రముండదు. కనుక అది ఊడిపోయినది.

గడువులో రాక ధిక్కారంబుసూపు సు
గ్రీవుని మన్నించి కినుకమాని
నానాదిశల నేలయీనిన గతి సాంద్ర
మై పొల్చు శాఖామృగాళిఁగూడి

గ్రామపట్టణసస్యభూములకనపాయ
మమరు చేందాన సైన్యములనడిపి
లవణాబ్ధితీర వేలావనంబునఁజేర్చి
రాత్రులరక్షాభరము వహించి
శరణుఁజొచ్చిన ఘనవిభీషణునిఁజేరఁ
దీసిపట్టాభిషేకంబు సేసినావు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 73

**తాత్పర్యము :** జానకీరామా! వర్షకాలము వెళ్ళగనే వచ్చెదనని కిష్కింధకు పట్టాభిషిక్తుడై రాజ్యసుఖానుభూతిలో మైమఱచి సమయమునకు నీ సన్నిధికి రాని సుగ్రీవుని మన్నించి కోపమును విడిచితివి. నేల యీనినట్లుగా అన్ని దిక్కులనుండి వచ్చి వానరులతో కలిసి, గ్రామాలకు, పట్టణాలకు, వారి పైరు పంటలకు నష్టము కలుగకుండునట్లు అడవిమార్గములువెంట సైన్యములను నడిపించి, సముద్రతీరమందున్న ప్రదేశమునకు సైన్యములు చేర్చి రాత్రివేళ అదమఱచి నిద్రించు వానరులకేమియు కీడు జరుగకుండ వారిని రక్షించు భారమును పూని, శరణనివచ్చిన రావణుని సోదరునకప్పుడే వానరమధ్యమున సముద్రజలములు తెప్పించి, లంకకు పట్టముగట్టినావు.

రంగదుత్తుంగోర్మిసంగతాగాధ పా
ధస్సు లమేయ సంతాపమొందె
మైనాక శైలాది నానావిధ స్థావ
రములు భేదిలియంబరమున కెగసెఁ
గమఠనక్రగ్రాహతిమితిమింగిలముఖ
సత్త్వసంఘాతముల్ సచ్చితేలె

విలయావసరమునఁ గలుగునుత్పాతంబు
లఖిల దిక్కులయందు నతిశయిల్లె
నీవు బ్రహ్మాస్త్రమబ్ధిపై నేయువేళ
నాతఁడందునఁగాదె నిన్నాశ్రయించె
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 74

**తాత్పర్యము :** జానకీరామా! నీవు వానరవాహినులతో దక్షిణసముద్రతీరమునకు చేరితివి. సముద్రమునుదాటుటెట్లాయని చింతించి, సుగ్రీవ-విభీషణాద్యనుచరుల సలహామేరకు మూడురోజులు నిరాహారివై దర్భశయనము చేయుచు ప్రాయోపవేశము చేసి సముద్రుని శరణుజొచ్చితివి. కాని నీ శక్తి తెలియని సముద్రుడు నిన్ను సరకు చేయలేదు. అపుడు నీవు కోపముతో బ్రహ్మాస్త్ర మరివోసి సముద్రముపై నెక్కుపెట్టితివి. అపుడు ఉవ్వెత్తుగాపైకి లేచు సముద్రపుకెరటాలు - నీరు మిక్కిలిగా వేడెక్కి బాధపడినవి. ఆ సముద్రునిగర్భమందున్న హిమాలయుని పుత్రుడగు పక్షములుగల మైనాకపర్వతాది స్థావరములన్నియు సముద్రమును చీల్చుకొని ఆకాశమునకెగసినవి. తాబేళ్లు మొసళ్ళు తిమితిమింగిలాది సముద్ర జలచరములన్నియు చచ్చి పైకి తేలినవి. ప్రళయకాలమునందు కలుగు ఉపద్రవములన్నియు అన్ని దిక్కుల వ్యాపించెను. దానికి భయపడిగదా! సముద్రుడువచ్చి నిన్ను ఆశ్రయించెను.

పరిఖలేపునఁ బూడ్చిప్రాకారములుగూల్చి
మందురాచయములమాయఁజేసి
ప్రాసాద సౌధముల్ పడఁగొట్టి చంద్రశా
లోద్యానపంక్తుల నుర్విఁగూల్చి
శక్రజిదాదిరాక్షసులఁ జంపించి ద
శగ్రీవుఘటకర్ణు సంహరించి

శుచిసాక్షిగా ధరాసుతను గైకొనిదేవ
సన్నుతుల్గాంచి పుష్పకవిమాన
మెక్కి సాకేత పురికేఁగి పెక్కుహాయ
నములు పాలించితివి ముజ్జగములనోలి
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 75

**తాత్పర్యము :** జానకీరామా! లంకానగరము కోటగోడచుట్టునున్న అగడ్తలుపూడ్చి, ప్రాకారములు పడగొట్టి అశ్వగజశాలల సమూహములను నాశనముచేసి, మహాభవనములను చంద్రశాలలను ఉద్యానవనాలను నేలపై పడగొట్టి ఇంద్రజిదాది రాక్షసులనందరిని చంపించి, కుంభకర్ణుని చంపి అగ్నిసాక్షిగా సీతాదేవిని గ్రహించి దేవతల పొగడ్తలను పొంది పుష్పకవిమానముపై సాకేత నగరమునకేగి వేల సంవత్సరములు మూడులోకములను హాయిగా పాలించితివి.

కపులతో సచివపుంగవులతో వివిధభూ
ధవులతో సకలబాంధవులతోడ
హితులతోఁ బండితస్తుతులతోఁ గర్మంది
తతులతో భ్రాతృసంతతులతోడ
ధనముతో ధాన్యవర్ధనముతో ధర్మపా
లనముతోఁ బౌరబలంబుతోడఁ
గరులతోఁ బాదాతవరులతో రథరథ్య
హరులతో విప్రప్రవరులతోడ
సీతతోఁగూడి పట్టాభిషిక్తుఁడై య
యోధ్యనేలిన వైభవం బొగినుతింతు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 76

**తాత్పర్యము :** జానకీరామా! సర్వబ్రహ్మాండసార్వభౌమా! వానరులతో, మంత్రి శ్రేష్ఠులతో వివిధ నృపాలురతో సమస్త బాంధవులతో, హితులతో, పండితులొనరించు స్తోత్రములతో కర్మనిష్ఠులతో, సోదరులతో, ధనముతో, అధిక ధాన్యముతో, ధర్మబద్ధమైన పాలనతో, పౌరులతో, సైన్యముతో, ఏనుగులతో, కాల్బలములతో, రథములతో, గుఱ్ఱాలతో, బ్రాహ్మణశ్రేష్ఠులతో, సీతాదేవితోకూడి పట్టాభిషిక్తుడవై అయోధ్యను పాలించిన నీ వైభవమును నుతించెదను.

అగ్నిహోత్రునకు దాహకశక్తినొసఁగూర్చి
అగ్నికి నగ్నివై యలరినావు
ఘనసమీరణుని జగత్ప్రాణునిఁగాఁజేసి
గాలికి గాలివైయేలినావు
వసుధావధూటికి వహనశక్తినొసంగి
వసుధకు వసుధవై పొసఁగినావు
గగనంబునకు నవకాశగుణంబిచ్చి
నింగికి నింగివై నెగడినావు
జలములకుఁ బ్రాణిజీవనశక్తినొసఁగి
నీరములకును నీరమై నిలిచినావు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! **77**

**తాత్పర్యము :** ఓ జానకీరామా! భద్రాచలధామా! అనంతసార్వభౌమా! అగ్నిహోత్రునకు కాల్చగలశక్తినిచ్చి అగ్నికి అగ్నిగా ఒప్పితివి. వాయువునకు లోకులకు ప్రాణములిచ్చు శక్తినిచ్చి గాలికి గాలివై పరిపాలింతువు. భూదేవికి భారమును భరింపగలశక్తినిచ్చి భూమికి భూమివై ప్రకాశించితివి. ఆకాశమునకు అవకాశగుణమును కల్పించి, ఆకాశమున కాకాశమై నిలిచితివి. నీటికి ప్రాణులకు జీవనమిచ్చు శక్తినిచ్చి నీటికి నీరువై భాసించుచుంటివి.

ధాతకు సృష్టివిధానంబు సమకూర్చి
ధాతకు ధాతవై తనరినావు
శశికురుజ్యోత్స్నా ప్రసారశక్తి నమర్చి
శశికీవు శశివై పొసంగినావు
హేళికిభూరితేజోలాభమొనఁగూర్చి
హేళికి హేళివై యెసఁగినావు
భారతికిఁ గలాధికారంబు సమకూర్చి
వాణికి వాణివై వరలినావు
లక్ష్మికిని సర్వభోగలాలసలు దీర్చి
సిరికిసిరివై యశస్సుచేఁ జెలఁగినావు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ! 78
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర!

**తాత్పర్యము :** ఓ జానకీరామా! భద్రాద్రిరామా! కృపాసముద్రా! రామభద్రా! నీవే బ్రహ్మదేవునకు సృష్టింపగలశక్తినిచ్చి బ్రహ్మకు బ్రహ్మవై యొప్పుచుంటివి. చంద్రునకు చల్లని వెన్నెలలను ప్రసరింపజేయగలశక్తినిచ్చి చంద్రునకే చంద్రుడవై ప్రకాశించుచుంటివి. సూర్యున కఖండ తీక్ష్ణతేజస్సిచ్చి సూర్యునకు సూర్యుడవై అతిశయించితివి. సరస్వతీదేవికి సకలకళలయందధికారమును గూర్చి సరస్వతీదేవికి సరస్వతివైతివి. లక్ష్మీదేవికి అందరకును సంపదలనిచ్చుశక్తిని కలిగించి, లక్ష్మికి లక్ష్మివైయున్నావు.

ముప్పదేడులనాడు మొనసిదేవళముని
ర్మింపుమా!యని నియమించినావు
నేనాలయంబట్లు నిర్మింప వేణుగో
పాలాహ్వాయముతోడనాలయమున

నిలిచియుంటివివిత్త నికరంబులేకున్కఁ
గడచు టెట్లికముందుఁ గార్యములని
తలఁపోయనొకరాత్రి ధాతవాల్మీకితో
స్వప్నంబునందు సాక్షాత్కరించి
* పలికె రామయణంబు ముప్పదియురెండు
సారులు పఠింప నీ వాంఛతీరుననుచు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 79

**తాత్పర్యము :** ఓ జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమా! ముప్పది సంవత్సరములకు ముందు నాకొక దేవాలయము నిర్మింపుమని నన్నాజ్ఞాపించితివి. నేను శ్రమించి ఆలయమును నిర్మింపగా అందు వేణుగోపాలుడను పేర మూలవిరాట్టువై ప్రకాశించుచుంటివి. నాదగ్గర దేవళము నిర్మించుటకు చాలినంత ధనములేదు. ఇక కార్యములెట్లుసాగునా?యని చింతించుచుండ ఒకరాత్రి రామాయణ సృష్టికర్త వాల్మీకితో కలసివచ్చి నా స్వప్నమున సాక్షాత్కరించితివి. ఈవిధముగా ధాతపలికెను. రామాయణాన్ని ముప్పదిరెండు పర్యాయాలు పఠించినచో నీ వాంఛ తీరును అని. *పలికితివియనుటకు పలికె అని ప్రయోగించుట విచార్యము. “పల్కితివిరామగాథ ముప్పదియురెండు” అన్నచో సరిపోవును.

ధాతపల్కినమాట తథ్యంబుగా నీవు
సౌమిత్రితోఁగూడి స్వప్నమందుఁ
గనిపించి భద్రనగముఁజేరి యప్పనిఁ
గావింపుమంటివక్కరణి నేను
భద్రాద్రికినిఁబోయి భక్తితో రామాయ
ణము పఠించియుఁ గార్యమును ముగించి

యిరువది మూడేడులేగె నిప్పటికి సా
ఫల్యంబు గాదాయె పని, మదీయ
పాపమో? నీవసత్యంబుఁ బల్కినావొ?
పల్కువాఁడవు గావీవబద్ధవార్త
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 80

**తాత్పర్యము :** జానకీరామా! బ్రహ్మ పల్కిన పలుకు సత్యమౌనా? కాదా? అని నేను తలంచునంతలో మరల నీవు లక్ష్మణునితో స్వప్నమందు సాక్షాత్కరించి, నీవు భద్రాద్రికిపోయి రామాయణ పారాయణము కావింపుమని ఆదేశించితివి. నేనదేవిధముగా భద్రాద్రికిపోయి భక్తితో రామాయణమును ముప్పదిరెండుసార్లు పఠించి యిప్పటికి ఇరువది మూడేడులు జరిగిపోయినవి. ఆ దేవాలయమైనదిగాని గోపురమంటపాదుల నిర్మాణము జరుగలేదు. అది నా పాపమా? నీవు స్వప్నమున అబద్ధమాడితివా? నీవబద్ధలాడువాడవు కాదుకదా!

ఏబదేడులనుండియే ప్రాయమందైన
నీ పాదసేవచే నెగడినాఁడ
నీవుముందిత్తువనెడు ధైర్యమునసొంత
ధనమునీకర్పించుకొనినవాఁడ
ద్రవ్యవ్యంబయ్యె దానఁగార్యమును స
ఫలము కాలేదని కలఁగినాఁడ
నేనశక్తుండనై గ్లానిఁజెందుట నిరీ
క్షించి యిదేమని యెంచినాఁడ
ముసలితనమునఁ బసలేక వ్యసనమొంది
నన్నిటులబాధలొందింప న్యాయమగునె?

జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 81

**తాత్పర్యము :** జానకీరామభద్రా! ఏబది సంవత్సరములకు ముందునుండి ఏ వయస్సునందైనను, నీ పాదసేవతో చరించితిని. నీవు ముందుముందు ధనమిత్తువని నా సొంతధనము సర్వము నీకు సమర్పించుకొంటిని. ద్రవ్యము ఖర్చుఐనదిగాని నేననుకొన్న కార్యము సఫలము కాలేదు అని బాధపడితిని. నేను శక్తిలేక బాధపడుచుండి ఇదేమియిట్లైనదని తలంచినాడను. ముదసలి తనమునందు శక్తిలేక బాధపడు నన్నింకను బాధలపాలు చేయుట న్యాయ మగునా?

దినమునకొకరోగ మెనయింపుచున్నాఁడ
వపవాదముల కాలయంబొనర్చి
కాఱింపుచున్నావు కడువిపత్తులపాలు
సేయుచున్నావు నాచిత్తమందుఁ
గడలేనివిభ్రాంతిఁ గలిగింపుచున్నావు
నేనోర్వఁజాల మన్నించియింక
నైన ననిష్టంబులన్నియుఁ దొలఁగించి
యనువుగాఁజేయు మిష్టార్థములను
శీఘ్రమునఁగార్యసంసిద్ధిఁజేయుమయ్య!
వంతలొందింపకుము బలవంతముగను
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 82

**తాత్పర్యము :** ఓ జానకీపతీ! ఈ వయస్సునందు రోజునకొక క్రొత్తరోగమును కల్పించుచుంటివి. భగవద్భక్తులకు భగవంతుడాపదలను పోగొట్టునను

నమ్మకముపోయి అపవాదములకు స్థానమైతివి. అనేకమైన ఆపదలపాలుచేసి బాధించుచుంటివి. నా మనస్సు నందంతములేని ఆశ్చర్యమును కల్గించుచుంటివి. ఈ స్థితిని నేను భరింపజాలను. నన్ను మన్నించి, ఇకనైనను నాకష్టములను తొలగించి, నా కోరికలను తీర్చి తొందరగా నా యిష్టార్థములు చేయవలసినది. బలవంతముగా నన్ను బాధలను పొందింపవద్దు.

సన్నాయికల్గి వేసరకూది యొక్కండు
 సమకూర్చినాఁడు లక్షలధనంబుఁ
గొయ్యఫిడేలు గైకొని యొక్క మానవుం
 డార్జించినాడు మహాధనంబు
సభలలోఁజేరిహాస్యముఁ జెప్పి యొక్కండు
 రొక్కముఁ గూర్చెను బొక్కసమున
లాస్యంబొనర్చి లాలసనొక్క వేశ్య మ
 హత్తరస్వాపతేయము గడించె

అట్టి ధనమఖిలేశ్వరుండైన నిన్ను
నాశ్రయించియుఁ బొందలేనైతినకటఁ
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 83

**తాత్పర్యము :** ఓ బ్రహ్మాండసార్వభౌమా! సీతారామా! అలసిపోకుండ నొకడు నాదస్వరముతో లక్షలధనము గడించెను. ఒక మానవుడు ఫిడేలు వాద్యముతో అధిక ధనమార్జించెను. సభలలో విదూషకునిగా హాస్యముచెప్పి ఒకడు బొక్కసము నిండరొక్కమును కూర్చెను. ఒక వేశ్యలాస్యముతో అతులితమైన ధనమునొందెను. సర్వేశ్వరుడవైన నిన్ను నేనాశ్రయించియు, ధనము నార్జింపజాలనైతిని.

బహుధనచయము సంపాదించెనొకండు సం
తతమును ధూమపత్రముల నమ్మి
పరిమితిలేని బంగరుఁ గూర్చె నొక్కండు
బొగ్గులబేరమింపుగ నొనర్చి
మంచిమానికములార్జించె నొక్కఁడు నిరం
తరమును గలపవర్తకమొనర్చి
మేడలుఁగొట్లు నిర్మించె నొక్కండు బీ
రముతోడఁ దోళ్ళ బేరమును జేసి

కాని నిన్నాశ్రయించి కైంకర్యమునకు
దుడ్డు సమకూర్పలేక వ్యర్థుండనైతి
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 84

తాత్పర్యము : ఓ రామభద్రా! ఒకడు ఎల్లప్పుడు పొగాకునమ్మి అధికమైన ధనమును కూర్చెను. ఒకడు బొగ్గుల బేరమునుచేసి అపరిమితధనంబు గడించెను. కలపవర్తకముచేసి యొకవ్యక్తి మణులుమాణిక్యములును ఆర్జించెను. ఒకడు ధైర్యముగా తోళ్ళబేరముకావించి, మేడలు వస్తువులు నిల్వచేసికొనుకొట్లు కట్టించెను. నేను ధనమునడుగుచున్నది నా సౌఖ్యముల కొఱకుకాదు. నీకు కైంకర్యము చేయుటకే. నిన్నాశ్రయించి అందులకు సరిపోవు ద్రవ్యము నార్జింపలేక వ్యర్థుడనైతిని.

విక్రమాదిత్యు పరాక్రమంబు గణించి
కవివరుల్ ద్రవ్యంబుఁ గాంచిరెలమి
భోజునికీర్తి నింపుగనెన్ని కాళిదా
సాదులు స్వాపతేయంబుగనిరి

మనుగృష్టరాయల వినుతించియును బెద్ద
నాదు లైశ్వర్యంబు నందఁగనిరి
రాజనరేంద్రునారాధించి నన్నయా
దులు గడించిరి గాదె బలుధనంబు
దైవమగు నీ వొసంగిని ధనముచేత
వారలటు చేసియుండ నీవల్లఁగాదె?
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 85

తాత్పర్యము : ఓ జానకీప్రాణనాథా! రామభద్రా! విక్రమార్కుని పరాక్రమమును వర్ణించి కవిశ్రేష్ఠులు అధిక ధనమందిరి. భోజమహారాజు కీర్తిని కీర్తించి కాళిదాసాదులెంతయో ధనము సంపాదించిరి. కృష్ణదేవరాయలను నుతించి పెద్దనాద్యష్ట దిగ్గజకవులు ఐశ్వర్యంబు పొందగలిగిరి. రాజరాజనరేంద్రు నారాధించి నన్నయాదికవులు అధికధనము కూర్చిరి కదా! నీవే వారికి ధనమొసంగగా ఆ రాజులు కవులకిచ్చిరి. వారే అటుచేసియుండగా నీవు భక్తులకీయలేవా?

దైవతద్రుమము చింతామణీకామధే
నువులు యాచకులచే స్తవముఁగనుట
గంగాసరస్వతీ కావేరిముఖనదుల్
సకల లోకోపకారకములగుట
నీహారకిరణాంబు వాహదుగ్ధాంభోధు
లనవరతము వదాన్యతనుగనుట
జీమూతవాహన శిబి దధీచి బలీంద్ర
రఘు సూతజులు దానరక్తిఁగనుట

సమజగత్కారణుండవై పొసంగు భవ ద
మోఘసర్గమ్ముచేఁ గదా! మోహనాంగ!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 86

**తాత్పర్యము :** ఓ భద్రగిరిధామా! జానకీరామా! కల్పవృక్షము, చింతామణి, కామధేనువులు యాచకులచే స్తుతులను పొందుట, గంగానది, కావేరీనది, సరస్వతీముఖనదులు లోకమునకుపకారము చేయుట, మంచుకిరణములు ధరించిన చంద్రుడు, పాలసముద్రముడు గొప్పతనమును పొందుట, జీమూత వాహనుడు, శిబిచక్రవర్తి, దధీచి, బలిచక్రవర్తి, రఘుమహారాజు కర్ణుడు దానదాతలగుట జగత్కారణుడవైన నీ దయచేతనేకదా!

కవియనునామంబుఁ గలిగించినావు స
త్కవితచేవచ్చు రొక్కంబులేదు
హరికథలందు నేర్పరిఁ జేసినావు త
త్కథలచేవచ్చు రిక్థంబులేదు
సభలలో భూరియశస్సుఁగూర్చితివి య
శస్సుచేవచ్చు కాంచనములేదు
ద్రవ్యాతురులను బాంధవులఁజేసితివి బాం
ధవులచే వచ్చు విత్తంబులేదు
కావలసినట్టి నీదుకైంకర్యమింక
నేవిధంబున నెరవేర్తు? ననకులేశ!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 87

**తాత్పర్యము :** ఓ జానకీపతీ! కవియను ప్రఖ్యాతిని నాకు కలిగించితివి. కాని సత్కవులకు వచ్చు ధనము మాత్రము రాలేదు. హరికథలు వ్రాయుటలో

చెప్పుటలో సాటిలేని నిపుణతను కీర్తినిచ్చితివి. కాని హరికథకులు సంపాదించిన ధనము మాత్రము నాకు రాలేదు. సభలలో అధికయశస్సును కల్గించితివి కాని ఆ యశస్సుచే వచ్చిన లాభములేదు. ధనవంతులను బంధువులను చేసితివి వారివలన వచ్చిన విత్తములేదు. కనుక నా కోరికమేరకు నీ కైంకర్య మే విధముగా చేయగలను? సూర్యవంశజా! రామా!

జంబూతరంగిణీ సైకతస్థలియెల్లఁ
భాసిల్లు హేమంబుఁ జేసినావు
రోహణాచలమందురుచిమీఱు మాణిక్య
సంచయంబులను నిర్మించినావు
గహ్వరీమధ్యభాగమునఁ జామీకర
మయముగా మేరు వమర్చినావు
రత్నాకరఖ్యాతి రాజిల్లునట్టు ల
వ్వనధిలో రత్నంబు లునిచినావు
తావకాధీనమున నిన్నిధనములుండ
డింగరులలేమిచేత నేడ్పింపనేల?
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 88

**తాత్పర్యము :** ఓ జానకీరామా! భద్రగిరిరామభద్రా! జాంబూనది ఒడ్డున ఇసుక తిన్నెలన్నియు బంగారుమయము చేసితివి. రోహిణాచలమందు మంచికాంతి నతిశయించు రత్నమాణిక్య సమూహముల నేర్పాటు చేసినావు. భూమికి మధ్య భాగమున బంగారుమయమైన మేరుపర్వతమును నిర్మించితివి. సముద్రమునకు రత్నాకరమను పేరు కలుగునట్లుగా దానినిండ రత్నములు నింపితివి. మీ అధీనమందిన్ని విధములైన ధనములున్నవి. అట్టివాడవు మావంటి మీబిడ్డలనేల ఏడ్పించుచుంటివి?

కాలాయసమునపలీల బంగరుఁజేసి
విలసిల్లు నా స్పర్శవేధినైనఁ
గ్రమముగా నెంతధనముఁ దీయుచున్న నూ
నముగాని నవనిధానంబులైనఁ
జిరతరైశ్వర్య సంసిద్ధికి మూలమై
యలరారులక్ష్మీకటాక్షమైన
వావిరి భోగాపవర్గముల్గలిగించి
దీపించు త్వదపాంగదృష్టినైన

నాకుఁ బ్రాప్తింపఁజేయు మనాథనాథ!
నీకుఁగీరితి కల్గు మనీషివంద్య!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 89

తాత్పర్యము : ఓ జానకీరామా! కృపాసముద్రా! నల్లని ఇనుమును తేలికగా బంగారమును చేయజాలు పరుసవేదినైనను, ఎంతధనము తీసినను తరుగక యుండు తొమ్మిదినిధులైనను, శాశ్వతైశ్వర్య సంసిద్ధికి మూలమై ప్రకాశించు లక్ష్మీదేవి కడకంటి చూపులైనను, అధికభోగములను మోక్షమును కలిగించు నీ కటాక్షమైనను నాకు కలుగచేయుము. ఓ అనాధినాథా! నీవట్లు చేసినచో నీకు కీర్తి కలుగును.

వచియింపరాని నెవ్వగఁగాంచు సుగ్రీవు
నికి రాజ్యమొసఁగుట నిక్కమేని?
శరణన్నమాత్రాన సరమావిభునిఁ జక్ర
వర్తిఁ జేయుట వాస్తవమగునేని?
వనికేగుచో ధనంబునుఁ గోట్లకొలఁది యా
చకులకిచ్చినమాట సత్యమేనిఁ?

దరుచరావళి కయోధ్యాపురి వసుమణీ
తతులొసంగిన మాట తథ్యమేనిఁ?

గరుణ నిటదావకీనకైంకర్యమునకు
వలసిన హిరణ్య మిమ్ము పావనవిలాస!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర!

90

**తాత్పర్యము :** ఓ జానకీరామా! ఇంతటి బాధయని చెప్పుటకు సాధ్యముగాని బాధలందిన సుగ్రీవునకు నీవు రాజ్యమొసగినది సత్యమైనచో, శరణనివచ్చిన మాత్రమున సరమభర్తయగు విభీషణునిలంకకు చక్రవర్తిని చేసిన విషయము సత్యమైనచో, అరణ్యవాసమునకీవు పోవునపుడు యాచకుల కధికదానములచేసిన మాట సత్యమైనచో, వానరులకందఱకు, అయోధ్యలో ఘనమైన బంగారము రత్నములు ఇచ్చినమాట వాస్తవమైనచో, నీయొక్క సేవకు కావలసిన ధనమును (బంగారమును) నాకు దయతో ప్రాప్తింపచేయవలసినది.

కైవర్తకాన్వయ గ్రామణియగుగుహు
నాలింగనము సేయునాదరంబు
సేతుబంధనవేళఁ జెంతకుఁజేరు చి
క్రోడంబు మీఁదనెక్కొనిననెనరు
బాడబోద్ధృతదండతాడితంబై శర
ణన్న కుక్కురముపై నడరుకరుణ
గూబతో వైరంబుఁ గొనినీకు మ్రొక్కిన
గ్రద్దను నృపుఁజేయు కనికరంబు

నేఁడు నామీఁదఁ బొదలించి నీ పనులకు
వలయుధనమిచ్చి రక్షింపు మలఘుశీల!

జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 91

**తాత్పర్యము :** జానకీరామా! అత్యలఘుశీలా! జాలరివంశ శ్రేష్ఠుడైన గుహుని కౌగిలించుకొనిన ఆదరము, సేతుబంధన చేయువేళ సేవచేయుటకు వచ్చిన ఉడుతపై చూపించిన ప్రేమ, కఱ్ఱతో బ్రాహ్మణునిచే కొట్టబడిన కుక్కపై ప్రదర్శించిన దయ, గూబతో వైరమును పొందివచ్చి నమస్కరించిన గ్రద్దను రాజును చేసిన కృప, ఈనాడు నామీద వ్యాపింపజేసి, నీ ఆలయ కార్యక్రమములకు కావలసిన ధనమిచ్చి కాపాడుము.

రామచంద్రస్వామి కపుల సహాయంతో సముద్రముపై సేతువును నిర్మించుచుండెను. అపుడొక ఉడుత రామకార్యమునందు తాను కూడ రాముని సేవింపవలయునని తలంచెను. నీటిలో మునిగి, ఇసుకలో పొరలాడి, ఆ ఇసుకను ఒంటపట్టించుకొని సేతువుపైకివచ్చి రాతికి రాతికి మధ్య ఉన్న ఖాళీలను, తన ఒంటినున్న మట్టితో పూడ్చుచుండెను. రాముని పాదములకు గట్టిగా రాళ్లు తగులకుండ దాని నిసుకతో కప్పుచుండెను. అది చేయుచున్న సేవను చూచి రాముడు ముగ్ధుడై దానిని పట్టుకొని దాని శరీరముమీద మూడు వ్రేళ్ళతో నిమిరెను. అవి శాశ్వతముగా ఉడుతల శరీములందు గుర్తులుగా మిగిలియున్నవి. ఎవరైనను సాయముచేసినచో ఏదో 'ఉడుతాసాయ'మను చుందురు.

రాముడు పరిపాలన చేయుచుండగా పశుపక్ష్యాదులకు గూడ న్యాయము చేయబడుచుండెను. ఒకనాడు ఒక గ్రద్ద ఒక గ్రుడ్లగూడ రామునికడకు వచ్చి తమకు న్యాయమును సేయుమని అర్థించినవి. న్యాయనిర్ణేతలు రాముని సమక్షమందే ఏమి మీ ఆరోపణలని ప్రశ్నించిరి. అందులకు గ్రద్ద "ప్రభూ! ఒక చెట్టుమీద గూడు కట్టుకొని నివసించుచుంటిని. నేనింటలేని సమయమున ఈ గూబ నా గృహమును ఆక్రమించి యిది తనదేయని బుకాయించుచున్నది.

ఎట్లైనను నా గూడు నాకిప్పింపుడని కోరెను. గ్రుడ్లగూబ ఆ గూడు తాను నిర్మించుకొంటిననియు, ఈ గ్రద్ద తనదనుచున్నదనియు వాదించెను. అపుడు న్యాయనిర్ణేతలు గ్రుడ్లగూబతో ఆ గూటినెప్పుడు కట్టుకొంటివని ప్రశ్నించిరి. అయ్యా! ఆ చెట్టు కొంత పెద్దదగుచున్న సమయములో నిర్మించుకొని అందే నివసించుచుంటినని చెప్పెను. కాని గ్రద్ద ఈ భూమి పుట్టినపుడే తాను గూడు కట్టుకొంటిననెను. గ్రద్ద అబద్ధము చెప్పుచున్నదని అందరకు అర్థమైనది. రాముడు ఆ గ్రద్దను ఖండింపబోగా ఆకాశవాణి వారించి ఆ గ్రద్దను కుడిచేతితో స్పృశింపుమని చెప్పెను. రాముడట్లే చేసెను. ఆ గ్రద్ద ఒకరాజుగా మారి తన వృత్తాంతమును చెప్పెను. రాముడాతని రాజు నొనర్చెను.

తన రాజ్యమున పశుపక్ష్యాదులకు గూడ ధర్మము జరుగవలయునని, కొలువుకూటము వాకిట సోదరుడైన లక్ష్మణునే కాపలా ఉంచెను. ఒకనాడొక కుక్క వీధిలో పరుండియుండెను. ఒకానొక బ్రాహ్మణుడు దండహస్తుడై ఆ వీధి వెంట వచ్చుచు పండుకొనియున్న కుక్క తలపై కఱ్ఱతో ఒక దెబ్బవేసెను. దాని తలపగిలి రక్తము కారుచుండెను. అదే రూపముతో కుక్క రాముని కొలువు కూటమునకు వచ్చెను. లక్ష్మణుడాకుక్క పరిస్థితిని చూచి రామునకు ఫిర్యాదు చేయుటకు వచ్చినదని తలంచి దానిని కొలువులోనికి కొనిపోయెను. ఆ కుక్కను కొట్టినవానిని తీసికొనిరమ్మని రాముడు భటుల నాదేశించెను. వారుపోయి కొంతసేపటికి ఒక బ్రాహ్మణుని వెంట పెట్టుకొనివచ్చిరి. అపుడు న్యాయనిర్ణేతలు ఓయీ! ఈ కుక్కను కొట్టితివా?యని ప్రశ్నించిరి. ఆతడు కొట్టినట్లు అంగీకరించెను. అది నిన్ను కఱువవచ్చినదా? లేక నీ వెంటపడినదా?యని అడిగిరి. అందులకావిప్రుడు, అట్టిదేదియు లేదనియు, వీధిలో పరుండి యున్నదనియు తానే ఊరక దానికి కొట్టితినని అంగీకరించెను. నిరపరాధినియగు కుక్కను బాధించిన ఆ బాపనికి ఏమి శిక్ష వేయవలయునని.రాముడు మంత్రులతో నాలోచించుచుండ, ఆ కుక్క మనుష్యభాషలో "ప్రభూ! నాదొకమనవి. ఈతనిని ఈ సమీప పర్వతముపైనున్న శివాలయమున కధ్యక్షునిగా నియమింపు"డని చెప్పెను.



Scanned with CamScanner

రాముడచ్చెరువొంది, "పిచ్చిదానా! అది చాల సంపన్న శివాలయము. అఖండ సుఖములు లభించును. నిన్ను బాధించిన వానికంత సుఖసమగ్రత కూర్పవలయునని ఏల కోరుచుంటివి?" అని అడిగెను. అప్పుడా శునకము "స్వామీ! పోయిన జన్మలో ఆ దేవాలయాధ్యక్షుడను నేను. దైవధనమును విచ్చలవిడిగా అనుభవించిన కారణమున నాకీ శునకజన్మము వచ్చినది. ఈ శునకజన్మము నందలి కష్టములు తెలియవలయునన్నచో, ఆతడును నావలె కుక్కుర జన్మమెత్త వలయు"నని తెల్పెను. రాముడంగీకరించి ఆ బ్రాహ్మణుని ఆ శివాలయమున కధ్యక్షుని నొనరించెను.

కడిమిసుబాహుముఖ క్షపాటులఁగూల్చి
కౌశికాధ్వరమును గాచినావు
ఖరముఖాసురుల సంగరమందుఁ దునుమాడి
యార్తులౌ మునులఁ గాపాడినావు
యోజనబాహుఁడైయున్న కబంధునిఁ
ద్రుంచి జంతువుల రక్షించినావు
పరివారయుతముగాఁ బంక్తికంఠునిఁ జంపి
యఖిలలోకవిపత్తులడఁచినావు

శాత్రవుల మామకాశయ శత్రువుల వ
ధించి సంతోషమొనఁగూర్పు మంచునుంటి
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 92

**తాత్పర్యము :** ఓ జానకీరామభద్రా! ధైర్యముతో సుబాహుడు మొదలైన రాక్షసులను సంహరించి విశ్వామిత్రుని యజ్ఞమును కాపాడితివి. ఖరుడు మొదలైన రాక్షసులను యుద్ధములో చంపి జనస్థానమునందు ఆర్తులైయున్న మునులను ప్రోచితివి. యోజనముల పొడవున్న చేతులుగల కబంధుని చంపి

అతని చేతులలో చిక్కి అతని కాహారము కాకుండ అడవిజంతువులను రక్షించితివి. రావణుని పరివారముతోకూడ వధించి సర్వలోకముల బాధలను పోగొట్టితివి. శత్రువులను చేంపుటకాదు. నా ఆశయశత్రువులను వధించి సంతోషమును కూర్పుమనుచుంటిని.

శత్రుసంహారమ్ము సల్పువేళలయందు
నేకశరంబె నీకినకులేశ!
కరణత్రయమునందుఁ గాలత్రయమునందు
వాక్యమొక్కటి నీకవార్యశౌర్య!
నవసుందరీమణీనివహవిముఖ నీకు
సీతయొక్కతె పత్ని పూతశీల!
శరణాగతత్రాణ నిరతమౌదానకం
కణమొక్కటియె నీకుఁగౌసలేయ!

యిట్టి మహనీయుఁడవగు నీ చెట్టపట్టి
యును గృతార్థుండఁగానైతి ననువె నీకు?
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 93

తాత్పర్యము : ఓ జానకీరామా! రామునిదొకటే బాణము. ఒకటే మాట, ఒకటే భార్యయని ప్రసిద్ధినందితివి. శత్రువులను సంహరించు సమయములందు నీకొక్కటే బాణము. మనోవాక్కాయ కర్మలయందు, భూతభవిష్యద్వర్తమానము లందు ఒకేమాట. క్రొత్తవారగు సౌందర్యవతులయందు విముఖుండవైన నీకొక్కటియేపత్ని. శరణాగతులను రక్షించెదనను మాటయిచ్చి కట్టుకొన్న కంకణ మొక్కటియే. ఇంతటి మహనీయుడవయిన నిన్ను పట్టుకొని కృతార్థుడను కాలేకపోయితిని. ఇది నీకు తగినదేనా?

నిర్హేతుకంబుగా నీవు బాలుఁడగు నా
స్వప్నంబునందు సాక్షాత్కరించి
యుపదేశమొసఁగి నిరుపమానకృపతో భ
వత్ప్రభావముఁ గొంతవఱకుఁ దెలిపి
తల్లి నిజస్తనంధయుఁ బ్రోచుచేందాన
బహువిధ బాధలు వాపిప్రోచి
ఫలవృక్షమును వృద్ధిఁ బఱచు మానవుభంగి
నీ పాదసేవచే నిపుణుఁజేసి

యిపు డుదాసీన భావంబు నెనసిన నన్నుఁ
గస్తిపడఁ జేయనేల యోకౌసలేయ!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 94

తాత్పర్యము : ఓ జానకీపతీ! కృపాకంధీ! కారణరహితముగా బాలుడనైన నా కలలో కన్పించితివి. సాటిలేని దయతో చేదువుసందెలులేని నాకు నీ ప్రభావమును కొంతవఱకు తెల్పితివి. తల్లి తన పసిబిడ్డను పోషించురీతిగా బహుబాధలు పోగొట్టి రక్షించితివి. ఫలవృక్షమును మానవుడు పెంచుకొను విధముగా నీ పాదసేవయందే వృద్ధి పొందించితివి. ఇప్పుడు ఉదాసీన భావముతో నూరకుండి నన్నేల బాధలపాలు చేసెదవు?

సర్వవిరించ్యండ జఠరస్థుఁడవు నీవు
వసుధ నొక్కెడ నుండువాఁడ నేను
గురుతర కల్యాణగుణసముద్రుండ వీ
వవగుణవ్యూహ గేహంబు నేను
మంగళదేవతా మానస్థుఁడవు వీవు
అనవరతము మంగళార్థి నేను

నిత్యముక్తస్తోత్ర నికరార్హుఁడవు నీవు
బద్ధజీవులలోన బలుఁడ నేను
తారతమ్యంబెఱింగియుఁ జేరఁదీసి
యిపుడు విడనాడనౌనె? యోయిన కులేశ!
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 95

**తాత్పర్యము :** సమస్త బ్రహ్మాండభాండములు గర్భమందుగలవాడవు నీవు ఈ భూమియందొకచోట నుండువాడనునేను. అత్యధికమగు కరుణాసముద్రుడవు నీవు. అవగుణములకు స్థానమైనవాడను నేను. మంగళదేవతయొక్క మనస్సు నందుండువాడవునీవు. ప్రతిక్షణము మంగళములను కోరువాడను నేను. ముక్త పురుషులస్తోత్ర సమూహములకు అర్హుడవు నీవు. బద్ధజీవులలో మొదటివాడను నేను. ఓ జానకీరామా! భద్రగిరిధామా! మనయిద్దరిలోగల ఈ భేదమును తెలిసియున్న నన్ను చేరదీసితివి. ఇప్పుడు నన్ను విడువవచ్చునా?

అలదుగ్ధవార్థియట్లమృత మీవలెఁగాని
యెండిన చెఱువట్టు లుండఁదగునె?
పారిజాతము భంగిఫలములీవలెఁగాని
పూరణీకుజమును బోలఁదగునె?
తలమానికములతోఁ దులతూఁగవలెఁగాని
శిలతో సమానమై వెలయదగునె?
దేవతాగవిమాడ్కి నీవీయవలెఁగాని
వంధ్యార్జునమురీతిఁ బరగఁదగునె?
నీవు భక్తుల రక్షించు సావిలో వి
భూతులకు రెంటికేక ప్రభుండవయ్యు

జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 96

తాత్పర్యము : ఓ జానకీరామా! బ్రహ్మాండసార్వభౌమా! పాలసముద్రమువలె అమృతమీయవలెనుగాని, ఎండిపోయిన చెఱువువలె నిరుపయోగముగా నుండవచ్చునా? పారిజాతవృక్షము (కల్పవృక్షము) వలె అనంతఫలము లీయవలయునుగాని, బూరుగుచెట్టువలె నుండవచ్చునా? శ్రేష్ఠమగు రత్నములతో తులతూగవలయునుగాని రాయివలెనుండవచ్చునా? కామధేనువు మాదిరిగా అర్థులకీయవలయునుగాని ఫలింపని మద్దిచెట్టువలె నుండవచ్చునా? నీవు రక్షించుకాలములో నిత్యవిభూతికి లీలావిభూతికి రెండింటికి నీవే ప్రభుడవు. ఇట్లు వర్తించుట తగునా?

రాఘవాయ! జ్ఞానరక్షాయ! వైరాగ్య
భక్తిప్రదాయ! తుభ్యం నమోఽస్తు
ధనధాన్యకీర్తి విద్యాదాన నిరతాయ!
పరభీకరాయ! తుభ్యం నమోఽస్తు
దుర్దాంతదుర్భిక్ష దుర్దశారోగ వి
పద్వినాశాయ! తుభ్యం నమోఽస్తు
జానకీసహితాయ! శత్రుఘ్నలక్ష్మణ
భరతాగ్రజాయ! తుభ్యం నమోఽస్తు

భార్గవమదాపహాయ! తుభ్యం నమోఽస్తు
భర్గచాపహరాయ! తుభ్యం నమోఽస్తు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 97

తాత్పర్యము : ఓ జానకీరామా! కృపాసముద్రా! రాఘవునకు, జ్ఞానమును రక్షించువానికొఱకు, వైరాగ్యభక్తులను ప్రసాదించు నీకు నమస్కారము. ధనము,

ధాన్యము, కీర్తి విద్యాదానము లెల్లప్పుడు నిర్వహించుచు శత్రుభీకరుడవైన నీ కొఱకు నమస్సు. అడచుటకు వీలుగాని దుర్భిక్షము, దుర్దశ-రోగములు ఆపదల నాశనము చేయు నీ కొఱకు వందనము. సీతాసహితుడవైన నీకు భరత లక్ష్మణ శత్రుఘ్నులకు అన్నవైన నీ కొఱకు అంజలి పరశురాముని మదము నాశమొనరించిన నీకు వందనము. శివధనుర్భంగము చేసిన నీ కొఱకు నమస్కారము.

శక్తిక్షమాధైర్యశౌర్యసత్యస్థైర్య
జ్ఞాననిధానాయ! తేనమోఽస్తు
సౌలభ్యవాత్సల్య సౌశీల్య తారుణ్య
దానాది నిలయాయ! తేనమోఽస్తు
వీర్యకారుణ్య గాంభీర్యార్జవామేయ
తేజస్సముద్రాయ! తేనమోఽస్తు
సౌహార్దమార్దవైశ్వర్యామితౌదార్య
సూనృతావసథాయ! తేనమోఽస్తు

జానకీప్రాణనాథాయ! తేనమోఽస్తు
భానువంశప్రధానాయ! తేనమోఽస్తు
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 98

**తాత్పర్యము :** జానకీరామభద్రా! కరుణాసాంద్రా! శక్తి ఓర్పు ధైర్యము, శౌర్యము, సత్యము, స్థిరత్వము, జ్ఞానములకు స్థానమైన నీకు నమస్కారము. సులభత్వము వత్సలత్వము, సుశీలత్వము తరుణత్వము దాతృత్వములకు స్థానమవైన నీకు నమస్సు వీర్యము-దయ-గాంభీర్యము-అమేయ తేజస్సు-ఆర్జవములకు సముద్రుడవైన నీకు నమస్కారము. సత్యములకు స్థానమైన నీకు నమస్సు. సీతాప్రాణనాథుడవైన నీకు నమస్కారము. సూర్యవంశదీపకుడవైన నీకు నమస్కారము.

అభివాదములు నీ కఖిలలోకారాధ్య!
జోహార్లదభ్రయశోనిధాన!
వందనంబులు నీకవాప్త నిఖిలకామ
జయము జయము నీకుఁ జక్రపాణి
భద్రంబు నీకు విపన్నివారక కృష్ణ!
చిన్నిపూవులు రమాచిత్తచోర!
మంగళంబులు నీకు మధుదానవవిదార!
కల్యాణములు భక్తకల్పభూజ!
జోతలివె నీకుఁగేశవాచ్యుత! ముకుంద!
నతులువామన! నారాయణా! నృసింహ
జానకీరామ! బ్రహ్మాండసార్వభౌమ!
భద్రగిరిరామభద్ర! కృపాసముద్ర! 99

**తాత్పర్యము :** ఓ జానకీపతివైన రామా! సర్వబ్రహ్మాండములకు చక్రవర్తివైనవాడా! భద్రగిరిమీదనున్న రామభద్రా! దయసముద్రా! అఖిల లోకారాధ్యుడవైన నీకభివాదములు. ఆకసమంటిన కీర్తికి స్థానమైన నీకు జోహార్లు. పొందిన సమస్త వాంఛలుకల నీకు వందనములు. చక్రమును హస్తమందు కలిగిన నీకు జయము. ఆపదలను రానీయకుండ కాపాడు కృష్ణా! నీకు భద్రములు. లక్ష్మీచిత్తహారుడవైన నీకు చిన్నిపూలు. మధువను రాక్షసుని చంపిన నీకు మంగళములు. భక్తులకు కల్పవృక్షమవైన నీకు కల్యాణములు. కేశవా! అచ్యుతా! ముకుందా! నీకు జోతలు. వామనా! నారాయణా! నరసింహా! నీకునతులు

సర్వం శ్రీరామార్పణమస్తు





కీ.శే.పద్యాల కుటుంబయ్య-బసవపున్నమ్మ
దంపతులు




భాష్యకార సమాజ స్థాపకులు
మహర్షి శ్రీ వేంకటదాసస్వామి గారు



తర్కవేదాంత విశారద

శ్రీరమా చిత్రశాల

**పండిత శ్రీ మొవ్వ శ్రీనివాస పెరుమాళ్ళుగారు**



శ్రీవేణుగోపాల సేవాశ్రమాధిపతులు, తర్కవేదాంత "కవిభట్టారక"
శ్రీ మొవ్వ దాశరథి సూరి "విష్ణుదాసు" గారు.

గుడివాడ. ది.30-8-1998

